శ్రీ ర స్తు.

# శ్రీకృష్ణవాస్తుశాస్త్రము.

(ఆంధ్రతాత్పర్య సహితము.)

ములుకుట్ల. విశ్వనాథశాస్త్రులు గ్రంథకర్తవారివలన

అధికారముపొందిన

ఈ గ్రంథము

పొన్నేరి. స్వర్ణమ్మకు

సకలస్వతంత్రము యిచ్చియున్నది.

పైవారు అనుమతిన

కో. లక్ష్మణమొదలియారువారిచే

టైటల్ పేజిమాత్రము.

చెన్నపురి:

చంద్రికా ముద్రణాలయమున

ముద్రితము

1925



వెల] [0-8-0

B

రాధారాణి అండుకో, నెం 9. చాకలవీథి, సౌకార్ పేట, మదరాస్.

---

(దేవతాసిద్ధియగు) మలయాళ మంత్రరాజీయము.

ఇది రెండుభాగంబులలో ముద్రింపఁబడిన మంత్రగ్రంథము. మొట్టమొదట నిది కేరళభాషయగు మలయాళభాషలో నుండినది. మేము ధనవ్యయ శరీరప్రయాసలకు వెనుదీయక మంత్రశాస్త్రజ్ఞులైన పండితుల సాహాయ్యంబున నాంధ్రంబున ముద్రించితిమి ఇందుఁ బ్రతిమంత్రమునకు నష్టకర్మవిధాయకంబు యేర్పాటుచేసి యంత్రసహితంబుగ నుండుటఁ జేసి ఇదిచదివి యీప్రకారం వశపరచుకొనువారలకు విశేషఫలముఁ నొసంగు కామధేనువువలెనుండును. ఇందుజెప్పబడియుండు నధిష్టాన దేవతలు విఘ్నేశ్వరుడు, సుబ్రహ్మణ్యుడు, ఆంజనేయుడు, బాలా, గరుడుడు, సూర్యుడు, మలయాళశృంగిదేవత, పంచభూతములు, సరస్వతి, మహాలక్ష్మి, భద్రకాళి మొదలగునవి, ఇవిగాక బిడ్డలకు, పిన్నలకు పెద్దలకు కర్మవశంబునవచ్చు సోకుళ్లను, పంపులను, తోడుబోతులను నివారణచేయు మంత్రంబులును యంత్రసహితముగ నుండుటంజేసి ఇది ప్రతియింట నుండదగిన గ్రంథమగును. ఈగ్రంథమును జదివినవెనుక వేరుగ్రంథములను జూడవలయునను నిచ్ఛజనింపదు. ఒకప్రతినిగొని చదివిచూచినయెడల మామాటలందలి సత్యాసత్యములు బోధపడును ఇవి యితర మంత్రగ్రంథములవలెగాక మంత్రశాస్త్రోక్తప్రకారంబున ఋషి. బీజము, శక్తి కీలకము, వినియోగములు దెలుపంబడి యంగన్యాసకరన్యాసములతో ధ్యానమంత్రములతో విలసిల్లుచున్నయది. అష్టపరికర్మముల వివరించునపుడు హోమము, తర్పణము, ఫలము సాంగముగ శాంతముగ విశదీకరింపబడియున్నది. మే మాగ్రంథమునుగురించి శ్లాఘించుటకన్న మీరలే యొక ప్రతినిగొని యందలి గుణావగుణంబులఁ గనుట మేలని యింతటితో నిలిపెదము.

రెండుభాగములు ఒకటేబైండు ప్రతి 1-కి 1-12-0

సకలసర్వగుణ అదృష్టదీపిక.

ఈ జ్యోతిషశాస్త్రమందరికి ముఖ్యముగా కావలసినది. ముహూర్తభాగము, లగ్నభాగము, దశాభుక్తిభాగము, గ్రహాభాగము, స్వప్నభాగము, స్త్రీభాగము. ఋతుభాగము, పురుషభాగము, హస్తభాగము, సాముద్రికభాగము, ఉత్తమ భాగములు, ఆంజనేయప్రశ్న, రామప్రశ్న మొదలగు ముఖ్యవిషయములుగలవు. ఇదిగాక శ్రీరామసీతా అష్టోత్తరము నూతనముగా చేర్చబడియున్నది. ప్రతి 1-కి 0

B

శ్రీరస్తు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

# శ్రీకృష్ణవాస్తుశాస్త్రము

ఆంధ్రతాత్పర్య సహితము.

ములుకుట్ల - విశ్వనాథశాస్త్రులు గ్రంథకర్తవారివలన
అధికారము పొందిన

ఈ గ్రంథము.

పొన్నేరి - శారణమ్మకు సకలస్వతంత్రము యిచ్చియున్నది.

పైవారి అనుమతివలన

## కో. లక్ష్మణమొదలియారువారిచే

చెన్నపురి.

శ్రీ వేణుగాన ముద్రాక్షరశాలయందు
ముద్రించి ప్రచురింపంబడియె.

1925



దీనిక్రయము 8 అణాలు.

ஸ்ரீ கிருஷ்ணவாஸ்து சாஸ்த்திரம்.

2



శ్రీరస్తు.

శ్రీహయగ్రీవాయనమః.

# శ్రీకృష్ణవాస్తుశాస్త్రము.

ఆంధ్రతాత్పర్యసహితము.

చ. శ్రీమహిళామనోవిభుఁడు చిన్మయమూర్తి సమస్తదేవతా।
గ్రామణి వారిజాసనసురస్తవనీయపదారవిందుఁడు।
ధామయశోధురంధరుఁడు తామరసాక్షుఁడు పేరుసోముల।
గ్రామనివాసుఁడాశ్రితశరణ్యుఁడు కృష్ణుఁడు మమ్ముఁబ్రోవుతన్.

తా. శ్రీదేవిభర్తయును, చిత్స్వరూపుఁడును, సమస్తదేవతలలో నాయకుఁడును, బ్రహ్మదేవుఁడు మొదలగువారిచేత గొనియాడఁబడువాఁడును, అధికమైన కీర్తిగలవాఁడును, పద్మములవంటి నేత్రములుగలవాఁడును, పేరుసోములమను గ్రామంబునందు వేంచేసినవాఁడును, ఆశ్రయించినవారల గాపాడువాఁడునునగు కృష్ణుఁడు మమ్ముల రక్షించుఁగాత.

క. శిరమున జాబిలిరేఖయు। కరముల పాశాంకుశములు ఘనతరలీలన్।
ధరియించు సర్వసేవ్యుఁడు। కరిముఖునకు వందనములు గావించు మదిన్.

తా. శిరమునం [illegible], చేతులయందు పాశాంకుశములను ధరించినవాఁడును, సకలప్రాణులకు సేవింపదగినవాఁడును, ఏనుగు ముఖమువంటి ముఖముగలవాఁడునునగు విఘ్నేశ్వరునకు నమస్కారములను జేసెదను.

క. అనుపమభక్తిఘటిల్లెడ। మనుపగ సంజలిసనత్కుమారాదిమహా।
మునులకు వాస్తువిదిజ్ఞుల। కనఘతరతపఃప్రభావహార్ద్యాత్ములకున్.

తా. గొప్పదయిన తపోమహిమచేత సంతసించుచున్న మనస్సుగలవారును, వాస్తుశాస్త్రంబును సమగ్రంబుగ జదివినవారును, నగు సనత్కుమారాది మునివర్గంబునకు వినయపూర్వకంబుగా నిరుపమానభక్తితో నమస్కారంబులను జేసెదను.

క. [illegible] । [illegible]

విరచింతు బద్యఘణతుల । సరసంబగు వాస్తుసారసంగ్రహము ననఘా.

తా. ఎల్లప్పుడు విద్వాంసుల సాంగత్యము ననలంబించుటచేతను, మఱియు నాగ్రంథముల మహిమను తెలిసియుండుటచేతను, పద్యరూపంబుగా దెనుగుభాషతో వాస్తుశాస్త్రసార సంగ్రహమను పేరుతో నీగ్రంథమును చెప్పెదను.

సీ. శ్రీకృష్ణపదభక్తిసేవాదరీణుండ వాసిష్ఠగోత్రసంభవప్రశంసనుడ। న
నుపమనాశ్వలాయనమౌనిసూత్రుడ విద్వత్కవీశ్వరవినయపరుం
డ । శ్రీమంతుడను పేరుసోమలరాజు వంశవార్ధికినిజై వాత్రుడగు
ను । గమనీయగుణకీర్తిగణపరాణ్మంత్రికి బౌత్రుండబరమపవిత్ర
చరిత॥ గీ॥ మల్లమకువెంగనామాత్యమణికిసుతుడ । సకలసిద్ధాం
తగణితశాస్త్రజ్ఞులెంచ । వాస్తుశాస్త్రంబుగావించి వార్తగాంచి ।
మహిని చెలువొందుగణపయామాత్రకవిని.

తా. షడ్గుణైశ్వర్యసంపత్పరిపూర్ణుండగు నారాయణుని పాదపద్మంబులయందు భక్తిగలవాడను, వసిష్ఠగోత్రంబున బుట్టినవాడను, నిరుపమానుడైన యాశ్వలాయనమునివరుని సూత్రముగలవాడను, విద్వాంసులకును కవీశ్వరులకును నమ్రుడను, జననాదిగనయిశ్వర్యంబుగలవాడను, పేరుసోమలరాజు అను గృహనామంబుగల యింటియందుబుట్టినవాడను, మనోహరంబులయిన గుణంబులును కీర్తియునుగల గణపరాజు అను మంత్రిపుంగవునకు మనుమడను పవిత్రమయిన చరిత్రలుగల మల్లమకును వెంగనమంత్రికిని బుత్రుండను, గణపయ్య అను పేరుగలవాడను; అగు నేను సకలమయిన సిద్ధాంతగణిత శాస్త్రంబులయందు నేర్పరితనంబుగల పండితులందఱును సంతోషంబును బొందునట్లు వాస్తుశాస్త్రంబును జేసి ప్రసిద్ధిని పొందునని తాత్పర్యము.

ఉ. సారసమైనవాస్తువను సత్కృతి నే నొనరించి చేసెదన్।
గారవమొప్పు గూర్చెదను గూర్చగ నే నొకటేని వాడనగు నా।
నేరిచినట్లయొక్కకృతి సేర్మిని జేసెదనంచు నేరుపు।
ల్నేరములున్ గ్రహించి కరుణింపదగుం గవులార మ్రొక్కెదన్.

తా. మనోహరమైన వాస్తుశాస్త్రంబునందు నొక్కటైనా నేనొక్క శాస్త్రంబును జేసెదనని తలచితి. అట్లుసేయుటకు నేనెంతటివాడను; అయినను నాదుశక్తికొలది జేయుదును. కావున నోపండితోత్తములారా! నా

గ్రంథమునందలిగుణదోషంబులను జక్కగావిచారించి దోషంబులను గప్పి పుచ్చి గుణంబులను బ్రకటనజేయుటకొఱకు నమస్కారంబులను జేసెదను.

గీ. మిత్రులైనట్టినిచ్చనమెట్ల శ్రీహరి। యనుయద్దానికొండమంత్రియు ననుభయ । భాషలనువాత్సహాయులైప్రబలునిపుడు । దగుకృతి యొనర్చుటకునసాధ్యంబుగలదే.

తా. మిక్కిలి స్నేహితులయిన నిచ్చనమెట్ల శ్రీహరియనునామధేయంబుగలవారును, దానికొండమంత్రియు నను నీయుభయులును గీర్వాణాంధ్రభాషలయందు దగిన సామర్థ్యంబుగలవారు. వీరిరువురును నాకు సహాయులైయుండగ నాకుగొదువ కొంచమైనను లేదని యభిప్రాయము.

క. వాస్తుగతుల్బహువిధముల । విస్తారమొనర్చగ్రంథవిస్తారమగుఁ । బ్రస్తావముకొలదినిగృహ। వాస్తువుమాత్రంబొనర్తువసుధం దెలియఁ.

తా. వాస్తుశాస్త్రంబులయొక్కరీతులు అనేకవిధంబులవిస్తారములై యున్నయవి; అట్టి శాస్త్రంబులను జక్కగానాలోచించి నాదు శక్తి కొలది యెల్లవారును సంతసించునట్లు గృహవాస్తుశాస్త్రంబును దేటపఱచి చెప్పెదను.

## షష్ఠ్యంతములు.

క. శ్రీరమణీసుఖరతికిఁ । సారయశోధృతికిదివిజసన్నుతకృతికిఁ।
చారుదయాలంకృతికిని। బారగుణోన్నతికిమేరుభూధరధృతికిఁ.

నిరుపమగనగాత్రునకు। స్వరమపవిత్రునకుభక్తవరజైత్రునకుఁ।
శరణాగతమిత్రునకుఁ । సరసిజనేత్రునకుదైత్యజనజైత్రునకుఁ.

నిగమాగమవాక్యస్ఫుర। దగణితసుమమాయుతాయుతాంబరమణికిఁ।జగదధిపచారుమూర్తికి।జగదాదరణీయజారచౌర్యాగ్రణికిఁ.

మాగవనప్రాపునకు।స్నాఘనవిభశరీరునకుమణిహారునకుఁ। శ్లాఘిత్రఘోషకుటీరప। యోధృతచోరునకుద్రీభువనోద్ధారునకుఁ.

కరఖరకిరణస్ఫురదురు । నురురుచిచెలువునకుపేరుసామలనగర।
స్థిరనిత్యోత్సవపూజా । గురుతరఖేలునకుమదనగోపాలునకుఁ.

తా. లక్ష్మీదేవికి మనోహరుడును, శ్రేష్ఠమయినకీర్తిగలవాడును సుందరమయిన యలంకారములుగలవాడును, గొప్పగుణంబులుగలవాడును, మేరుపర్వతమువంటి ధైర్యముగలవాడును, సామ్యములేని నీలమేఘమువంటి శరీరముగలవాడును, మిక్కిలిపవిత్రమయినవాడును, భక్తులకు

గోర్కెల నొసంగువాడును, శరణుబొందినవారలను రక్షించువాడును, పద్మనేత్రుండును, దానవకులమును నశింపజేయువాడును, వేదశాస్త్రములయొక్క వాక్యస్ఫురణలచేత గొనియాడఁదగిన గుణములుగలవాడును, అపరిమితమయిన కాంతిగలవాడును, లోకంబులయందు గొనియాడదగిన గుణంబులుగలవాడును, లోకమునందు జారచోరత్వములయందు నెక్కుడు సామర్థ్యంబుగలవాడును, సూర్యకిరణంబులవలె బ్రకాశించుచున్న తేజఃపుంజముగలవాడును, మిక్కిలి సొగసైనవాడును, పేరు సోమలగ్రామమునందు స్థిరములును, శాశ్వతములును అగు పూజాద్యుత్సవములుగలవాడును, అత్యధికమయిన విలాసములుగలవాడును, మదనగోపాలుడను నగు నారాయణునకు నమస్కరించి ఈ గ్రంథమును అంకితంబుగా సమర్పించెదను.

వ. సమర్పణంబుగా నేయొనర్పంబూనిన వాస్తుసారసంగ్రహంబునందు గృహారంభ, మాస, సంక్రాంతి, పక్ష, తిథి, వారనక్షత్ర, యోగకరణగ్రహచారలగ్న శుభాశుభంబులునుదిగాయరాశివిరోధవర్ణారూఢక్షేత్రగ్రామాద్యర్పణనామ రాశిబలంబులును, వర్జనీయక్షేత్రగంధరసంబులును, భూపరీక్షనభూశోచ్చాటనంబులును, మృత్పూర్ణజలపూర్ణ జలావర్తఫలంబులును,చతుర్విధహస్తమానాంగుళిమాత్రాంగుళదండప్రమాణంబులును ప్రాచీసాధనశంకుసూత్రలక్షణప్రసారణసంశయశంకుభగ్నసూత్రత్రుటిక ఫలంబులును, శల్యపరీక్షయు గుణావర్తనవిధియు, జలగతిమార్గంబును, చతుర్దశయికాదశ నవషడ్వర్గలక్షణంబులుంగల గణితాగతధనఋణాయ దివసవారనక్షత్రయోగకరణాంశాయుష్యాంతక్షధిశభూతకులలగ్నశుభాశుభనిర్ణయంబును, రాశికూటంబును, రాశీశ్వరఫలంబును, స్థానబలంబును, తారాబలంబును, వేదకూటంబును, గ్రహమైత్రతయుగణకూటంబును, యోనికూటంబును, మాససంక్రాంతి వాస్తుపురుషగతిక్రమంబును, పదయాత్రయు, గ్రామ్యావృత్తిపరీక్షయు, శంకుస్థాపనమార్గంబును, గృహాకర్షికాచక్రంబును, చక్రపాట ఫలంబును, శంకుస్థాపనవాస్తుపూజావిధానంబును, ద్వారనిర్మాణంబును, ద్వారబంధ కవాటంబు తెఱంగును, క్షేత్రభాగభిత్తిప్రమాణంబులును, శాలసర్పగతివిధంబును, స్తంభప్రతిష్ఠాప్రకారంబును, లగ్నగతగ్రహఫలంబులును, పట్టికాబంధానుసాధనంబులును, ధాతుసంధికూర్పువిధంబును, యేకశాలద్విశాలత్రిశాలచతుశ్శాలాష్ట

శాలవిధశాలగంద్రగృహ, షల్లిగృహకాశీగృహ, నాట్యశాలసముల్ల శాలాది భేదంబులును, అష్టవాటంబులరూపనిర్ణయంబును, గోపఖననిరూపణంబును, గృహాంగణవృక్షనియమంబును, గృహోపకరణనిశ్చయంబును వివరించెద. తా. ఈవచనమునకు తాత్పర్యమును గనుము.

సీ. చైత్రంబుధనహానిజయమువైశాఖంబుజ్యేష్ఠంబుమృతిభీతి జేయునిజము। ఆషాఢమునబశుహరణంబుశ్రావణము నభృత్యసంతతిమొనయ జేయు। భాద్రపదంబునబహురోగములునెందు కలహమాశ్వీజిజేయుకార్తికంబు । శ్రీపదంబగుమార్గశీర్షంబుభయమగు నలపుష్యమునజెందునగ్నిభయము॥ గీ॥ భాగ్యకరమగుమాఘంబుఫాల్గుణమున । రత్ననాశంబు జేయుప్రయత్నమునను । అధికమాసముక్షయమాసమశుభదంబు । లనుజెప్పిరిమునివర్యులబ్జనాభ.

తా. చైత్రమాసమునందిల్లుగట్టినేనిధనహానియు, వైశాఖమాసమునందు ధనసమృద్ధియు, జ్యేష్టమాసమున మృత్యుభయమును, ఆషాఢమాసంబున బశుక్షయమును, శ్రావణమాసంబునందు భృత్యవృద్ధియు, భాద్రపదమాసంబున రోగంబును, ఆశ్వయుజమాసంబున కలహమును, కార్తికమునలక్ష్మీప్రవేశము, మార్గశీర్షమాసంబునభయముగలుగును, పుష్యమాసంబున అగ్నిభయమును, మాఘమాసమున భాగ్యప్రదమగును, ఫాల్గుణమాసంబున రత్ననాశమునుగలుగ జేయును. అధికమాసములు అశుభమునుగలుగ జేయును. కావుననీమాసములయందుగలిగెడిశుభాశుభవృత్తాంతములను దెలిసి గృహములనుగట్టుట మంచిదని తెలియవలయు.

సౌరమాన సంక్రాంతిఫలము.

సీ. మేషంబుశుభమును నిర్మించువృషభంబు దానధనమిచ్చుమిథునంబుగీడు। కర్కటంబుననుదాగలిగించుబశువృద్ధి సింహంబుభృత్యులజెనయజేయు। గన్యనురోగంబుఘటియించుతులసౌఖ్యమలవడవృశ్చికంబర్థవృద్ధి । కార్ముకంబునహానిగనుపించుమకరంబు బహుధాన్యమిచ్చుగుంభమునరత్న॥ గీ॥ ములనుఘటియించుమీనముభయమొసర్చు । సంక్రమంబులఫలములజాడలెరిగి । యిండ్లుగట్టమేలిన్నివిధంబుల । ధీరమతులుగీనిజెలిసికృష్ణా.

తా. మేషమాసము శుభములను గలుగ జేయును, వృషభమున ధనమునొసగును, మిథునమాసంబునగీడుగలుగును, కర్కటకమాసంబున

బహువృద్ధిగలుగును, సింహమాసంబున భృత్యులుగలుగుదురు, కన్యామాసంబున రోగముగలుగును, తులామాసము సౌఖ్యప్రదము, వృశ్చికమాసంబు ధనవృద్ధినొసంగును, ధనుర్మాసము హానిప్రదమగును, మకరమాసము ధాన్యవృద్ధిని గలుగజేయును, కుంభమాసము రత్నముల నొసంగును, మీనమాసముజయప్రదమగును, కావున నిర్విఘ్నంబుగ మేషాది మాసంబులు ఫలముల నొసంగునని యభిప్రాయము.

పక్షఫలము.

గీ. శుక్లపక్షమునను శుభములుసేకూరు । కృష్ణపక్షమైన గీడుజేయు।
బక్షములను రెంటిబరికించిగృహములు గట్టిరేనిసుఖముగలుగుకృష్ణా.

తా. శుక్లపక్షమునందు శుభముగలుగు, కృష్ణపక్షమునందు గీడుగలుగు, కాబట్టి రెండుపక్షములయందలి విషయములనాలోచించి గృహములు గట్టవలయును.

పక్షనిర్ణయము.

క. ధరశుద్ధతదియ మొదలుగ । సరసంబగుకృష్ణపక్షసప్తమిదనుకం।
గురియగుసితపక్షంబున । బరగుఁ శేషంబుబహుళపక్షముగృష్ణా.

తా. శుద్ధ తదియమొదలు బహుళసప్తమివరకును శుక్లపక్షమని చెప్పబడును. మిగిలినదినంబులు బహుళపక్షమనబడును. కాబట్టి పక్షద్వయంబులనుజూచుకొని శుభమగు శుక్లపక్షమునందు గృహారంభముసేయవలయునని తాత్పర్యము. సనత్కుమారవాస్తువునందు పక్షద్వయవిభాగము సేయబడినది. శ్లో. శుక్లతృతీయమారభ్య యావత్కృష్ణాంతుసప్తమి। శుక్లపక్షమితిప్రోక్తం శేషంకృష్ణముదాహృతమ్.

తిథిఫలనిర్ణయము.

గీ. నందతిథులయందనర్థమానర్థంబు । భద్రతిథులయందుబాధనంబు।
దర్శరిక్తలందదప్పదుమృత్యువు। పూర్ణజయలశుభముబొందుగృష్ణా.

తా. పాడ్యమి,షష్ఠి,ఏకాదశి, ఇవినందతిథులు. ఈనందతిథులయందు గృహముగట్టిరేని ద్రవ్యనాశముగలుగును. విదియ, సప్తమి, ద్వాదశి ఇవి భద్రతిథులు. ఇట్టి భద్రతిథులయందు గృహారంభమును జేసిరేని బాధనముగలుగును. తదియ, అష్టమి, త్రయోదశులు. ఈ జయతిథులు మహాశుభ సుభఫలంబును గలుగజేయును. పంచమి, దశమి, పూర్ణిమ ఇవి పూర్ణతిథులు. తిథియందు సుభముకలుగును. చతుర్థి, నవమి, చతుర్దశి,అనుతిథులను మృత్యుభయముగలుగ జేయును. అమావాస్యయందు

ధననాశంబును గలుగఁజేయును. కాబట్టి శుభాశుభ తిథిస్వరూపములనె ఱిగి యిండ్లుగట్టుట యుత్తమము.

వార ఫలము.

గీ. అర్కకుజవాసరంబుల నగ్నిబాధ । సౌరదిసోమవారంబునం దొరవు గలుగు । సౌమ్యగురుశుక్రవారములౌ సౌఖ్యదములు। శనిదినముతస్క రబయంబులుశ్రోయజాక్ష.

తా. ఆదివారం మంగళవారము అగ్నిభయమును, సోమవారము పరవును, బుధగురుశుక్రవారములు శుభమును, శనివారము చోరభయ మునుగలుగఁజేయును. సనత్కుమార వాస్తుశాస్త్రమునందు 'శ్లో. భాను వారేకృతం వేశ్మవహ్నినాదహ్యతేచిరాత్ । చంద్రవద్వర్థతేగేహం తు.య్యా తేచవిధేర్ధినే। భౌమవారేకృతం శేవాతల్లగ్నేన సప్తమేపినా । స్థంభే ప్రతిష్ఠితే గేహం దహ్యతేమరణంధృవమ్ । బుధవారేస్థిరయిశ్వర్యంసుఖపుత్రసమన్వి తం । భృత్యవాహనపాన్యాదిక కోత్యాంగీరసేదినే । భృగువారేచిరంతిష్టే త్కర్తాచచిరసంపదా । సర్వాన్యయిర్యంబలేన్మందవారేతస్కరభయావ హా। శుభవారే శుభం హిలారాబనగ్నేశుభేదినే । గృహారంభశ్శుభం కు ర్యాతస్యదైవాశుభావహమ్.' అనగా సూర్యవారమగ్నిభయమును, సో మవారము హానివృద్ధులను, మంగళవారము తిదంపయు, మేష వృశ్చికల గ్నములు (లేక యంగారకుడున్నలగ్నము) వహ్నిభయమును, బుధవార ము శాశ్వతమైన అష్టయిశ్వర్యములను, గురువారశుక్రవారములు సకలై శ్వర్యములును, శనివారము సర్వకాలములయందును దొంగలభయమును గలుగజేయును. మఱియొక గ్రంధంబునందు 'శ్లో॥ సోమేశుక్రేసదాసౌ ఖ్యంబుధేజీవేచచిత్తదం । కుజేసూర్యసదాదుఃఖ మందేతస్కరబాధకం॥' సోమవారమునందును, శుక్రవారమునందును గట్టిన యిల్లు సౌఖ్యంబును గలుగజేయును, బుధగురువారములయందు ధనముగలుగును, భానువార ము యెల్లప్పుడును దుఃఖంబును గలుగజేయును, శనివారము సర్వకాలం బులయందును దొంగలభయమును గలుగజేయును. కావున శుభాశుభ వారములను విచారించి గృహంబును గట్టుట యుక్తము.

నక్షత్ర ఫలము.

గీ. శతభిషధనిష్టపుష్యమిస్వాతిహస్త।చిత్తమృగశిరహరియుత్తరాశ్రయం బు। మైత్రరేవతిరోహిణులర్ధ్రాతిశుభము। ఇండ్లకార్యంభతారకలిముకుంద.

తా. శతభిష, ధనిష్ఠ, పుష్యమి, స్వాతి, హస్త, చిత్త, మృగశిర, శ్రవణ, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, అనూరాధ, రోహిణి, రేవతి, ఈపదునాలుగు నక్షత్రములును గృహారంభమునకు శుభప్రదములని తాత్పర్యము. సనత్కుమారవాస్తు శాస్త్రమునందు 'శ్లో. మృగశిరకర పూషాచిత్రమిత్రోత్తరాద్యాశ్శ్రివణవిజవేశా వాసవేద్రస్రభేషుబహుసుత ధనవంతస్తంభసంస్థాపనంస్యాదితివదతిమునీంద్రయిర్మానవానాంగృహాణి. మృగశిర, హస్త, రేవతి, చిత్త, అనూరాధ, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, శ్రవణము, పునర్వసు, శతభిషము, ధనిష్ఠ, అశ్వని, యీపదునేను నక్షత్రములును గృహారంభమునకు నత్యుత్తములని చెప్పబడినవి, గ్రంథాంతరే. 'శ్లో. అశ్వినీహ్యాశ్వదాతరాస్తంభస్థాపనముత్తమం । భరణీమరణాంకుర్యాత్కృత్తికాగృహవాహానం । రోహిణీఘనపుత్రస్యకురుతేకృష్ణనాశనం । మృగశిరాజవపుశ్యాంతిగార్జా్రిబహుభయావహే । పునర్వసౌధనప్రాప్తిః పుష్యఃపోష్ణాశ్రియాసవాళ్ ॥ ఆశ్లేషాభయదంకుర్యాన్మఖాల్పఫలదాయినీ! ఫల్గునీదైత్యమత్యంతముత్తరా బహుసత్కృతిం । హస్తాఖ్యాతింసుతందత్యాచ్చిత్రాచిత్రాలయంపరం । స్వాతీమందిరసుస్థిత్యైవిశాఖాగ్నిభయప్రదం। అనూరాధాసుహృద్వృద్ధిర్జ్యేష్ఠాదౌందర్భిక్షభయం। మూలాశత్రువినాశాయపూర్వాషాఢాభయప్రదా । వైశ్వదేవీసుతుధనమభిజిద్వ్యయమిచ్చతి । పుష్టిదంశ్రవణాచయువవాసనీధనంసుభం । శతతారాయురారోగ్యంపూర్వాభాద్రాంగహీనదా॥ఆహిర్బుధ్న్యంతుదారిద్ర్యం పౌష్ణఃపసువివర్ధనం । కుర్యాత్కుర్వన్మందిరస్య ఫలాన్యేతానిభారవః। గృహారేకాయుతం చంద్రరేఖాయుతం చంద్రరేఖాదిష్వంచ వర్జయేత్. అనగా అశ్వనిగృహారంభమునకుత్తమంబు, భరణి మరణమునొందించును, కృత్తికయందుగృహముదహనమగును, రోహిణియందు ధనపుత్రసంపదలు నశించునందురు. మృగశీర్షయందుదేహారోగ్యము గలుగును, ఆర్ద్రిబహుభయమును గలుగజేయును, పునర్వసు ధనమునొసంగును, పుష్యమి ధనాదికముల నిచ్చును, ఆశ్లేషయందు భయము గలుగును, మఖ కించిత్ఫలప్రదము, పుబ్బధయిర్యమును గలుగజేయును, ఉత్తరసత్కార్యములనుగలిగించును, హస్తయందుఖ్యాతియును సుతులును గలుగును, చిత్తవిచిత్రములయిన గృహములను గలుగజేయును, స్వాతి గృహమునకు స్థిరత్వమునుగలిగించును, విశాఖ అగ్నిభయమునిచ్చును, అనూ

శాధయందుస్నేహితులభివృద్ధినొందుదురు, జ్యేష్ట ఋధాభయమునుగలు
గజేయును, మూలయందు శత్రువులువశించుదురు, పూర్వాషాఢ భయం
బును గలుగజేయును, ఉత్తరాషాఢయందును శధనసమృద్ధిగలుగును, శ్రవ
ణనక్షత్రము పుష్టినిజేయును, ధనమునొసంగును, శతభిషమునం దాయు
రోగ్యయిశ్వర్యములు గలుగును, పూర్వాభాద్రయందు గహీనమగును,
ఉత్తరాభాద్రయందు దారిద్ర్యంబుగలుగును, రేవతియందు పసుసమృద్ధిగ
లుగును, కావున నివ్విధముగ శుభాశుభనక్షత్రస్వరూపములను దెలిసి
గృహారంభములను జేయవలయును. మరియుగృహారేఖాతోగూడిన చంద్రుడు
న్న నక్షత్రమును విడువవలయును.

యోగకరణఫలము.

సీ. వృద్ధివరీయాన్నామసిద్ధముహూర్ణశుభశోభనబ్రహ్మేంద్రశుక్లసిద్ధ।సా
ధ్యశివప్రీతిసౌభాగ్యధృతిధ్రువాయుష్మాన్సుకర్మాదియోగములివి।పదు
నెనిమిదియుశుభప్రదములౌ వ్యాఘాతగండాతిగండవిష్కంభశూల।వ
జ్రవ్యతీపాతవైధృతిపరిఘముల శుభంబులివినొమ్మిదవలోన॥ గీ. బవ
వణిక్కైతెతుబీబాలవములు। కౌలవాకరణంబుసౌఖ్యప్రదంబు। దూ
షితంబులుశకునికింస్తుఘ్నభద్ర। నాగవచతుష్పదములుకందర్పజనక.

తా. వృద్ధి, వరీయాన్, సిద్ధము, హర్షణము, శుభము, శోభ
నము, బ్రహ్మము, ఐంద్రము, శుక్లము; సిద్ధము, సాధ్యము, శివము, ప్రీతి
సౌభాగ్యము, ధృతి, ధ్రువము, ఆయుష్మాన్, ఈపదునెనిమిదియును శుభ
కరంబులగును. వ్యాఘాతము, గండముఅతిగండము, విష్కంభము, శూ
ల వజ్రము, వ్యతీపాత్తు, వయిధృతి. పరిఘ, ఈతొమ్మిదియును గీడునుగ
లుగజేయు. బవ, వణిక్కు, తయితుల, బాలవ, గర, కౌలవ, ఇయ్యా
రుకరణములును గృహారంభంబునకు నుత్తమంబులు. శకుని, కింస్తుఘ్నము
బద్ర, నాగవము, చతుష్పాత్, ఇవ్వైదునుహానికలుగ జేయును. కావున
నివ్విధంబున యోగంబులయొక్కయు దాతమ్యములను దెలిసి గృహ
నిర్మాణంబును జేయుటయుత్తమము.

సూర్యచార ఫలము.

క. భరణినొగినుత్తరార్ధము। నెరికృత్తికయందురోహిణీపూర్వపదం।
బరుదుగసూర్యుండుండగ। గరమరుదుగనిర్మాట్టనాసుదహించుర్.

తా. భరణినక్షత్రముయొక్క మూడునాలుగు పాదంబులయు గా

న, కృత్తికా నక్షత్రంబుయొక్క నాలుగుపాదంబులయందును, రోహిణీ నక్షత్రంబుయొక్క ప్రథమద్వితీయపాదంబులయందును, సూర్యుడు సంచరించుచుండగ నిండ్లుకట్టుటయుచితంబుగాదు. మఱియు నీనక్షత్రంబులయందు కట్టబడిన గృహంబులు దహనంబును బొందును, కావున నీకాలములయందు యిండ్లుగట్టదగదు.

## కుజచారఫలము.

గీ. అగ్నిపుష్యమిమఖపుబ్బహస్తమూల। రేవతులయందుకుజుడున్న రేవతి నిండ్లుగట్టిరేనియసుతహానిగలుగునంత।వహ్నిగాల్చునువైరంబువాసుదేవ.

తా. కృత్తిక, పుష్యమి, మఖ, పుబ్బ, హస్త, మూల, రేవతి, ఇయ్యేడు నక్షత్రంబులయందును కుజుడుసంచరించుచుండగ నిండ్లుగట్టిరేని సుతహానియు నగ్నిభయంబును గలుగును.

## కుజచారదోషపరిహారము.

గీ. సరివిజలరాసులందునులజంద్రుండు।కడియతిడుగురుస్సుక్రినీక్షితుడయ్యేనేని। ఘనతరోన్నతిగృహములుగట్టవచ్చు।కుజునిదోషంబుగని లేదునిజముకృష్ణా.

తా. పైపద్యంబునందు జెప్పబడినప్రకారంబు కుజుడు సంచరించు కాలంబునందు జలరాసులయందు జంద్రుడుండి యాచంద్రుడుసుక్రునిచే జూడబడినేని కుజచారదోషమేమియును లేదు. మీనకర్కటమకరంబులు పూర్ణజలరాసులు, వృశ్చికతులామేషంబులుమూడును పాదజలరాసులు, మిథునవృషధనస్సులు కన్యారాశిమూడును నిర్జలరాసులు, ఇట్టిరాసులలో బూర్ణజలరాసులకుపయుక్తమయిన నక్షత్రములయందుచంద్రుడుండ సుక్రునిచేజూడబడినేని కుజదోషంబుబోవుననుట.

## బుధ గురుచారఫలము.

సీ. అశ్వినిమృగశీర్షహస్తోత్తరాచిత్ర రోహిణితారలరోహిణేయు। డుండంగగట్టిననెగిపుత్రపౌత్రసంపదలచేమరియుసుప్రబలుచుండు।శ్రవణంబునుత్తరాత్రయముపూర్వాషాఢ మృగశిరసర్పరోహిణులపుష్య। మినిబృహస్పతియుండగగట్టిన గలిమియాయుష్యంబుగలిగియుండు॥

గీ. సుగుసివాసనంబులకీగున్న రాసుల। నుస్పముందనీరలుండగాను। మాకిరంబులుట్టమువిడిచినలేకు। వాస్తుశాస్త్రమతేముపారిజాత.

తా. అశ్వని,మృగశీర్ష, హస్త,ఉత్తర,చిత్త,రోహిణి, ఇయ్యారు నక్షత్రములయందును బుధుడుండగాను, బుధవారంబునందును, బుధుడు

నివసించిన లగ్నంబునందును, బుధుడుస్వస్థానమైన కన్యయందుండిన సమయంబునందును, గృహారంభంబును జేసినేని సుఖధనపుత్రకళత్రాదిసంపదగలుగును. శ్రవణము, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, పూర్వాషాఢ, మృగశీర్షః, ఆశ్లేష, రోహిణి, పుష్యమి, ఈతొమ్మిది నక్షత్రంబులయందును బృహస్పతియుండుకాలంబున, బృహస్పతివాసరంబునందును బృహస్పతియొక్క లగ్నంబునందును, బృహస్పతియుచ్చరాశియందుండినను, గృహారంభంబును జేయుట యుత్తమము. ఇట్టి సమయములయందు గృహంబులుకట్టినేని పరమాయురారోగ్యయిశ్వర్యాభివృద్ధులుగలుగును.

### శుక్రశని రాహుచారఫలము.

సీ. జ్యేష్ఠపునర్వసుచిత్రాంత్యజలధనిష్ఠానురాధవిశాఖార్ద్రవరుణ ।
తారలశుక్రుండొతయుసంచరింపంగ నిండ్లుగట్టినశుభంబెనయుబతికి ।
వరుణస్వాత్యుత్తరాభాద్రపూర్వాభాద్రయమధనిష్టానురాధామరేశ ।
తారలశనియున్న తరినిండ్లుగట్టిన యక్షరాక్షసగుహ్య కాళిసేరు.
గీ. దనరరాహువులిచ్చినతారమొదలు। ఎదిరితారలుపదినాల్గుమృతములి
ట్టి। తారలనునిండ్లగట్టగదగదటంచు। జెప్పిరార్యులుమొదలనుశ్రీనివాస.

తా. జ్యేష్ఠ, పునర్వసు, చిత్త, రేవతి, పూర్వాషాఢ, ధనిష్ఠ, అనూరాధ, విశాఖ, ఆరుద్ర, శతభిషము, ఈపదినక్షత్రంబులయందునశుక్రుడుస్వసమయంబునందు గృహారంభమునుజేసినేనికర్తకుశుభముకలుగును. శతభిషము, స్వాతి, ఉత్తరాభాద్ర, పూర్వాభాద్ర, భరణి, ధనిష్ట, అనూరాధ, జ్యేష్ట, ఈయెనిమిది నక్షత్రంబులయందును శని సంచరించు సమయంబున గృహనిర్మాణంబునుజేసినేని యక్షరాక్షసపిశాచాదులుచేరును. రాహువుసంచరించునట్టి నక్షత్రంబు మొదలుకొని యెదురుగనుండా పదునాల్గు ఈనక్షత్రములయందు గృహారంభమును జేయదగదని యభిప్రాయము.

### గురుశుక్రాస్తమయ ఫలము.

క. గురుశుక్రుల స్తమించిన । బరువడినీచస్థవృద్ధబాలకులయినన్ ।
విరసపుతాపులచుండిన। సరిసంయుక్తులైననిండ్లగట్టరాదుధరిత్రిన్ ॥

తా. గురుశుక్రులిరువురు నస్తమయంబును బొందియుండగానైనను, వృద్ధులైయున్నను బాలకులయినను, నీచస్థానంబులయందుండగానయినను, గృహనిర్మాణంబును జేయరాదు. అట్లుగాక గృహంబుల గట్టినేని కాలిపోవును.

వర్ణేశ్వర ఫలము.

క. గృహనాయకజాతిగ్రహ । సహితయుతంబైన నస్తమయమొసపుడుః ।
సహితబలరహితుఁడునౌతఁకి । గృహంబులుగట్టినను బరులకిరవౌ కృష్ణా.

తా. గృహయజమాను డేజాతిపురుషుఁడో యాజాతిగ్రహంబు శత్రువులతోఁ గూడినను, అస్తమయంబు బొందినను, నిజస్థానంబు నొందినను, గృహములుకట్టిరేని పరులకుస్వాధీనములగును. 'శ్లో. గురుభృగూవిప్రౌ కుజార్కౌ నృపౌ వైశ్యౌ చంద్రబుధౌ తదన్యకులజో మందస్తు వర్ణేశ్వరః॥ అనగా గురుశుక్రులు బ్రాహ్మణులనియును, కుజసూర్యులు క్షత్రియులనియును, చంద్రబుధులు వైశ్యులనియును, శని శూద్రుడనియును, కాలామృతమునందు జెప్పబడినది. కావున నీవిషయమును జక్కఁగా నాలోచింపవలయునని యభిప్రాయము.

లగ్నఫలము.

క. స్థిరలగ్నములు త్తమములు । చరములు వెసమధ్యమములు చర్చింపంగా ।
ధరయందు ద్విస్వభావము । లరయనిషేధంబులండ్రు నార్యులు కృష్ణా.

తా. గృహనిర్మాణకాలంబునకు స్థిరలగ్నంబులు శ్రేష్టంబులు, చరలగ్నంబులు మధ్యమములు, ద్విస్వభావలగ్నములు నిషేధములని తాత్పర్యము. వృషభ, సింహ, వృశ్చిక, కుంభములు స్థిరలగ్నములు. మేష, కర్కట, తులా, మకరములు, చరలగ్నంబులు. మిథున, కన్యా, ధనుర్మీనంబులు ద్విస్వభావంబులని యెఱుంగవలయును.

లగ్నగతగ్రహఫలము.

క ఆరింటను బదియింటను । గిరిసంఖ్యను గ్రహములున్న గృహములుకట్టఁ ।
బరులకు జేబడు నిజముగ । బరగఁగ నారంభలగ్నఫలమిది కృష్ణా.

తా. గృహారంభలగ్నంబునకు నారవయింటియందును, పదవయింటియందును, ఏడవయింటియందును, గ్రహంబులుండెనేని గ్రహనిర్మాణంబును జేయఁగూడదు. ఒకవేళ నెవరైనను జేసిరేని యాగృహంబులు పరులపాలగునని తెలియవలయును. మఱికొందఱీపద్యంబున కింకొక్కవిధంబుగ తాత్పర్యంబును జెప్పెదరు. అదెట్లనిన గృహారంభలగ్నంబునందున్న గ్రహంబున కాలగ్నము నీచశత్రుక్షేత్రంబులలో నేదియైనను, లగ్నేశ్వరుడు శత్రుక్షేత్రగతుఁడైనను, లగ్నేశ్వరుఁడేడవయింటియందుగాని పదవయింటియందుగానియున్నను గృహంబులుగట్టరాదనియు నొకవేళగట్టిరేని పరుల

పాలగునసియును జెప్పుదురు. అవియడ ఉత్తమాభిప్రాయమని తెలియవలయు.

దిగాయ రాశివిరోధంబులకుఫలము.

సీ. ప్రాగ్దిశాధ్వజములుపగవృశ్చికంబునకు జ్వాలనదిగాయముల్ ఝషమకురి పులు। శమనదిక్సింహముల్ శత్రువుల్గన్యకుగడు దైత్యదిక్కుకుగర్కియరు లు। వరుణదిగ్వృషభముల్వైరముల్వాటికి బవనదిఙ్మార ముల్బడవ్రుతుల కు। ధనదదిగ్గజములు తగవు మేషమునకుశంభుదిక్కాకముల్దుంభ వైరు.

గీ. లగునుమకరంబుమిథునంబుహరియువృషము। మధ్యమునసిల్పిరేనియుమ డిసిపోవు। గావునదిగాయ రాసులక్రమ మెరింగి। ఇండ్లుగట్టిన శుభములుగల్గుకృష్ణ.

తా. తూర్పుదిక్కు, ధ్వజాయమున్ను, వృశ్చికరాశివారికిబనికిరా వు. ఆగ్నేయదిక్కుధ్వజాయమునుమీనరాశివారికినిబనికిరావు. దక్షిణపుది క్కును సింహాయమును కర్కాటరాశివారికి ననుకూలంబుగావు. పడమటి దిక్కును వృషభాయమును ధనుర్లగ్నంబువారికిబనికిరావు. వాయువ్యది క్కు ఖరాయమును తులాలగ్నము వారికిననుకూలంబుగావు. ఉత్తరదిక్కు గజాయమును మేషరాశివారికినుచితంబుగావు. ఈశాన్యంబును కాకాయ మును కుంభరాశి వారికిగావు. మకరమిథున సింహవృషభ రాసులవారు గ్రామమధ్యంబునందు గృహంబులనుగట్టరాదు. కావుననివ్విధంబు దెలియ క గృహనిర్మాణంబునుచేసిరేని యనేకము లైనయనర్థంబులుకలుగును.

వర్గాయాశము.

సీ. అకచటతపయశలష్టవర్గంబులు ప్రాగాదిదిశలనుబరగునంట।
గరుడమార్జాలసింహశ్వానసర్పమూషకగజశశములుండు।
అధిపువర్గంబు పంచమవర్గంబు శేషంబువరశుభంబు।
అధికవర్గంబుదానల్పవర్గపు మీదనుండినకర్తకుచితమగును.

గీ. అధికవర్గస్థలంబుననల్పవర్గ। లున్నచోరహానియగునందురుర్వియందు। శత్రుమిత్రాధ్యములయందుజాడలెరిగి। ఇండ్లుగట్టినశుభములుగల్గుకృష్ణ.

తా. అఆఇఈఉఊలుఅవర్గము, ఈయవర్గంబు తూర్పుననుండును. దీనికధిపతిగరుత్మంతుడు. కఖగఘఙలుకవర్గము. ఈకవర్గమాగ్నేయంబున నుండునుదీనికధిపతిమార్జాలము. చఛజఝఞలుచవర్గము. ఇదిదక్షిణంబున నుండును దీనికధిపతి సింహము. టఠడఢణలుటవర్గము. ఇది నైరుతిదిక్కున నుండును దీనికధిపతి శునకము. తథదధనలుతవర్గము. ఇదిపశ్చిమదిక్కున నుండును దీనికధిపతి సర్పము. పఫబభమ ఇదిపవర్గము ఇది వాయువ్య

దిక్కునందుండును దీనికధిపతిమేలుక. యరలవలుయవర్గ ఇదియుత్తరంబు నను, దీనికిగజ మేనుంగు. శషసహాఇదిశవర్గము, ఇదియీశాన్యంబున నుండును. దీనికిఁ తర్కుండేలు. ఈయెనిమిది వర్గంబులలోఁ బ్రతివర్గంబున కును నైదవవర్గంబు శత్రుస్థానము. కాబట్టి తననామధేయంబునందలి మొద టియక్షరమేవర్గమునయందునో చూచుకొని యావర్గంబునకును, శత్రువ గునర్గంబునందు గృహనిర్మాణంబును జేయరాదు. అధికబలంబుగలవార ల్పవర్గంబుగలచోటనిండ్లగట్టనగును. అనగా గరుడవర్గమునాడుసర్పవర్గం బుగలచోట గృహనిర్మాణంబును చేయవచ్చును. అల్పవర్గంబుగలవారు అధికవర్గంబుగలచోట గృహంబు గట్టరాదు. అనగాసర్పవర్గంబుగలవారు గరుడవర్గంబుగలచోట గృహనిర్మాణంబును జేయగూడదు. ఈప్రకారము బును చేసిఇండ్లుగట్టినవారు సుఖవంతులగుదురు. ఈపద్యార్థంబునకుసమం బుగగాలామృతంబునందు, 'శ్లో. క్షేత్రస్యాకచటాః క్రమాత్తపయశో వర్గాస్స్యురష్టౌస్థితాః ప్రాగాశాఖగరాట్బిడాలమృగరాట్ఛ్వాహ్యాఖునాగా శ్వశః స్వాద్యగాణవ్యదిపంచమోదిః. అను శ్లోకంబునకును బయిపద్యంబు నొక్కయర్థమేగనుక మరలవ్రాయలేదు.

సీ. అరయంగ సాధ్యనామాద్యక్షరమువర్గసంఖ్య దాఁగుడిదిక్కునరవినిల్పి।
పరసాధకాఖ్యాదివర్ణవర్గపుసంఖ్య నామభాగంబునఁబేర్చునిల్పి।
గజభాగ శేషంబు గణుతింపధనమగు తద్వ్యత్యయంబైనదనరుఋణము।
ధనమెక్కుడైయున్నధనవంతుడైయుండు ఋణమెక్కుడైయున్నఋణ
ము జేయు.

గీ. ధనఋణంబులుసమమైనదమకు। యశమునశించువైరాగ్యమూర్తిజేయు
మూఢబుద్ధినిసద్మములొన్నసికట్ట। రాదుగావునబదియమర్త్యాశ్రమేష్టా.

తా. ఒక మానవుండువచ్చి నేదిక్కున నింటినిగట్టవచ్చునాయని యడిగెనేని కర్తయొక్క యభీష్టమయినదిక్కు అకచటతపయశ, వర్గం బులలో నెన్నవవర్గమగునో యాసంఖ్యనుకుడి భాగంబుననునిచి పిమ్మటకర్త యొక్కనామాద్యక్షర మెన్నవవర్గమందుండునో యాసంఖ్యనుఎడమభాగం బునబెట్టియామొత్తంబును ఎనిమిదింటభాగహరింపగామిగిలినసంఖ్యధనము నియెఱుగవలయు. తొలుతటిసంఖ్య నెడమదిక్కుననున్నసంఖ్యను కుడిప్ర క్కనునుంచి ప్రక్కనున్నసంఖ్యను ఎడమదిక్కునను బెట్టి యామొత్తంబును యెనిమిదింట భాగహరంబును జేయగా మిగిలినసంఖ్యఋణమని తెలియనగు

యును. ఇట్లు ధనఋణంబులను రెంటిని దెలిపి ఋణంబుకంటె ధనమెక్కువ యయ్యెనేని యాదిక్కున గృహంబును నిర్మాణంబును జేయవలయును. ఋణమెక్కువై ధనముతక్కువైన దిక్కున గృహంబునుగట్టరాదు. ధనఋణంబులు రెండును సమంబుగనుండుదిక్కున గృహంబును గట్టుటవలన దోషంబులేకపోయినను లాభకరముగాదు. మఱియుగర్తయొక్కనామాద్యక్షరవర్గంబునకు నైదవవర్గము శత్రువర్గంబుగావున నట్టిశత్రువర్గస్థలంబున గృహంబులుగట్టుటయుచితంబుగాదు. ఈవిషయమంతయునువిస్పష్టముగునట్లుచెప్పెదను. అదియెట్లనిన; గురుమూర్తియనునొకవిప్రుండు త్తరపుదిక్కున నిల్లుగట్టవచ్చునాయనియడిగినపు డుత్తరపుదిక్కునకుం షవర్గము యవర్గము. ఆ యవర్గంబు యేడవది గురుమూర్తియొక్క నామాద్యక్షరంబు కవర్గంబులోనున్నది. ఆ వర్గంబు రెండవది, అంకానాంవామతోగతిః, అను నియమానుసారంబుగ మొత్తమిరువదేడయ్యె. ఈయిరువదేడింటిని ననిమిదింట భాగహారించగా మిగిలినసంఖ్యమూడు కావున ధనసంఖ్య మూడు, తొలుతటి యిరువదేడింటిని తల్లక్రిందుగజేసిననేని డెబ్బదిరెండగును. ఈమొత్తంబునెనిమిదింటభాగహారింపగా మిగిలినసంఖ్యమేమియును లేనందున ఋణములేదు. కావున గురుమూర్తియను విప్రునకు నుత్తరపుదిక్కున ఋణంబులేక ధనముమాత్ర మధికముయి యుండుటచే నద్దిక్కున గృహంబునుగట్టుట కుచితముయియున్నది. యీ ప్రకారంబు సకలజనులకును దెలిపి చెప్పునట్టి జ్యోతిష్కునివిచారించి తెలియవలయును. ఈ పద్యార్థంబునకు సరియగు శ్లోకము కాలామృతంబునందుగలదు. 'శ్లో. సాధ్యాఖ్యాప్రథమాక్షరక్తగణనా సంలిఖ్యతద్వామతస్తద్వత్సాధకనామచప్రవిభజేన్నాగైశ్చశిష్టంధనం। తాత్పర్యాద్విపర్యయాగతమృణాద్రవ్యాధికం భోగదంసామ్యంచేన్నసుతాన్వదం నరహితంప్రైశాఖ్యధామూర్తికృత్.'

నామరాశినిజూచులక్షణము.

సీ. షోడశచక్రంబునునుచిరంబుగవ్రాసి నడిమినాల్గిండ్లబోవిడిచిమొదల।
నీశాన్యమునమీనమీరీరగ్రహమునమున్న రాసునుప్రదక్షిణముగ్రాసి।
యందుశాలలుగట్టినఫలంబొకటియై మనుదొమ్మిదియుబంధుజనుల
బ్రోచు।పురగిరిరుద్రులుపోషించునరులను రెంటనారింటపదింటహాని.

గీ. నాలు గెనిమిదిపంద్రెండునునాశనంబు। గానకర్ణాదిశాన్యాదిగాగణించిచేసి।

యిండ్లగట్టినసుభములునెనయునంద్రు। వాస్తుసిద్ధాంతిమార్గంబువారిజాక్ష.

తా. నిలువు నైదుగీట్లను నడ్డంబుగ నైదుగీట్లనుగీసిన పదునారిండ్లగును; యిదియషోడశచక్రమనిపించుకొనును. ఈ షోడశచక్రంబునందు నడిమినాలుగిండ్లను విడిచి యీశాన్యంబు మొదలుచేసుకొని మీనాదిగా బండ్రెండురాసులను ప్రదక్షిణక్రమంబుగ వ్రాసి కర్తయొక్క నామరాశికి గృహారంభంబునకు నిర్ణయింపబడిన స్థలంబుయొక్క రాశియెన్నవదగునో యెంచవలయును. అట్లులెక్కనుజేయగా నెక్కటియైన తొమ్మిది రాసులయందుగృహారంభంబును జేయువాడు సర్వకాలములయందును బంధుజనులనుబోషించువాడగును. కర్తయొక్క రాశికి మూడుయేడుపదునొకండు రాసులుగలచోటున గృహారంభంబుజేసినేని పరులకుబోషించు వాడగును. యజమానునియొక్క రాశికి రెండు ఆరు పది యీస్థానంబులు హానినికలుగజేయును. యజమానరాశికి 4_8_12 స్థానంబులునాశమును కలుగచేయును. కావున నిర్విఘ్నంబుగా నామరాశికిగృహారంభంబును చేయ నిశ్చయించినస్థలంబునకును నచ్చుదలనుజూచి యిల్లుగట్టుటయుత్తమము. కాలామృతంబునందును 'శ్లో. అథదిగ్వర్గేషు గోని స్త్వాయంద్వాద్యాదిషు। విదిక్షుచయికమష్టలం మేషాది పూర్వాదితః. 'శ్లో. యేకస్మిన్నవ్యదినం మేచన వమేస్యాద్వ్యంధుసంరక్షకో। నాశస్త్వద్వితయేచషష్ఠ దశమేచేన్నామరాశ్యాదితః। రాత్రీయేచుదిస ప్తమే సంగజః యిః పోష్టసథయికాదశే చాష్టదేచసఘాతుకో గృహపల్ స్థాప్యత్వద్వాదశే. పైశ్లోకంబుయొక్క యర్థంబునకుబయిన తాత్పర్యంబునకును భేదంబులేదు. గావున మరలవ్రాయలేదని యెఱుంగునది.

క. కత్తెరముమ్మూలకును। ల్పవృత్తగు పణవాకృతియ పృథసిందా।
యత్తమువిసమాస్రంబగు। నెత్తమునిలయములుగట్టనిందృములువారి.

తా. కత్తెరగలదియును, మూడుమూలలునుమాత్రము కలదియును, వలయాకారమయినదియును, మద్దెలవలెనున్నదియును, పిథులయష్టగిన్ప కొందియును, విషమచతురంతకలదియును నగుభూమియందు గృహనిర్మాణంబును చేయవలదు. చేసెనేనిహానికలుగును.

సీ. ఊసరభూములనూరికినడుమను గోణదేశంబులగుంటకట్ల।
నిల్లుబాసెనుచోటనిందతంబట తాప్రపరగింగగుశిపినివారు చేల।
బుట్టబెట్టినచోటలదిట్లుబొందె పచోటుగోగణంబులునుందగూడు కోట

తగయినవరుణార్క తనయుల దెసలను బిలసమీపమునందు బేతభూమి.

గీ. తేనెనెయ్యిపెరుగునూనెనెత్తురుమీను। శవముపిట్టికంపులవణకసము।
తగదెయిండ్లుగట్ట తథ్యంబునరులకు। వాస్తుశాస్త్రమతము వారిజాక్షి.

తా. ఊషరక్షేత్రము గ్రామంబునకును మధ్యప్రదేశము గ్రామంబునకుమూలగుంటగల ప్రదేశము, నీళ్లుపారెడుస్థలము, పదుగురు నిందించుతావు, దేవాలయపునీడబారు ప్రదేశము, పదుగురుచేదిట్టువడినభూమి, శ్మశానము, పశువులుమందగ జేయునట్టి ప్రదేశంబు, పశ్చిమ దక్షిణపుమూలలు తక్కువగుస్థలము, బిలంబునకును సమీపము, తేనె, నెయ్యి, పెరుగు, నూనె, నెత్తురు, మీనుశవము, పిట్టలు వీనియొక్క వాసనగల ప్రదేశము, ఉప్పునేల, యిట్టిప్రదేశంబులయందు గృహములనుగట్టుట యుచితంబుగాదని తాత్పర్యము.

గ్రాహ్యాచేత రసగంధస్వరూపలక్షణము.

సీ. మహిశుభ్రవర్ణంబు మధురరసంబును పద్మసుగంధంబు బ్రాహ్మణులకు।
రక్తవర్ణపుభూమి రసముగాషాయంబు హస్త్యశ్వవాసనయవనిపులకు।
అవనిపచ్చనివర్ణ మామ్లరసంబును పశుధాన్య గంధంబు వైశ్యులకును।
క్షితినీలవర్ణంబు చేదుకారపురసం భాసురపరిమళం బంఘ్రిజులకు.

గీ. శబలమయినసంకరంబునకగు। మధురరసము శాలిమించిదగును।
సస్యములుఫలించు సర్వాసహాస్థలి। సకలజాతిజులకు సౌఖ్యమిడు వా.

తా. తెల్లని రూపియు, తియ్యని రుచియును, తామర పుష్పంబుల యొక్క వాసన వంటి వాసనగలదియును నగు ప్రదేశము బ్రాహ్మణుల గృహ నిర్మాణంబును చేయుటకు తగియున్నది. ఎఱుపురంగును వగరు రుచియును గలదియును, ఏనుగుల యొక్కయు గుఱ్ఱంబుల యొక్కయు వాసనగలదియునగు ప్రదేశము, క్షత్రియులు గృహంబులు గట్టదగినది. పచ్చని కాంతియును, పుల్లని రుచియును, పశువుల వాసనయును, ధాన్యపు వాసనయును గల భూమి వైశ్యుల నిర్మాణంబునకు తగినది. నల్లని కాంతిగలదియును, చేదు రుచియు గలదియును, కారపు రుచి గలదియును, కల్లు వాసన కలదియును, నగు భూమి శూద్రుల కుచితమైనది. చిత్రవర్ణము కలదియును, మధురమైన రసము కలదియును నగు భూమి సంకరజాతివారు గృహనిర్మాణంబును జేయ యోగ్యమైనది. తియ్యని రుచి గలదియును, సువాసన కలదియును, సస్యములు ఫలించునదియును నగు భూమి యెల్లవారల

నుదగినదని తెలియవలయు. కాలామృతంబునందు 'శ్లో. ఈషత్ప్రశ్చిమద
క్షిణోన్నతసుమహాలక్ష్మీ ప్రదానేతరాసమ్యగ్గంధ సమన్వితానకదాదుగణం
ధయుక్తాత్రిదా. చేత్రశ్వేత మధ్యాల్పర క్తముఖలు పీతంచకృష్ణం క్రమాద్వి
ప్రాదేశ్మదురంభ వేచటుకంతిక్తం షాయేంశుభమ్, అనగాగృహంబుగట్టె
డుభూమిపశ్చిమదక్షిణ భాగములందుచుక మిఱుయయుండిన గృహపతికిభా
గ్యంబునుగలుగజేయును. అట్లుగాకున్న దారిద్ర్యప్రదమగును. మంచివాస
నతో గూడియుండిన స్వర్ణమునిచ్చును. దుర్వాసనాయుక్తమయిన పీడా
కరమగును. తెలుపువర్ణంబుగలిగి తియ్యనిరుచియున్న భూమి బ్రాహ్మ
ణులకును యిచుక నొల్లనయి కారముగలదైయున్న భూమి రాజులకును
పచ్చనివర్ణంబుకలిగిచేదయియున్న ప్రదేశంబు వయిశ్యులకును, నల్లనివ
ర్ణంబుకలిగియుప్పగానుండునేల శూద్రులకును శుభప్రదమగును గాన
నాలోచించి తగినస్థలంబులయందు గృహంబును కట్టవలయును.

భూప్రార్థన.

వరాహేణోద్ధృతే దేవి ధనధాన్యాభివర్ధ సి।
కళ్యాణాయుమ్మ్యదం దేహిస్థానమస్మిత్ప్రభావహామ్।

బలివిధి. 'శ్లో. దేవతాభ్యఃపితృభ్యశ్చ భూతేభ్యస్సభావహామ్।
యేత్ర త్తానసవాసిభ్యః ప్రయచ్ఛామిబలింనమః.

భూతోచ్చాటనము.

శ్లో. అముకస్యకరిష్యేత్రసేశ్మయుమ్మద్దనంజయ।
అపరస్పరంతుభూతాని తుష్టానమస్యత్తుగమ్యతామ్.

పల్లమున మృజ్జలమునునిండించుటకు ఫలము జెప్పుట.

సీ. నిలయాధిపునిమూరకొలిచి చౌకంబుగా నంతియలోతుగానచటదొవ్వి
యామట్టిపూరింపనిదికొంతమిగిలి సముద్రమునసంపద ల్పొదలు నెవడు
సరిబోయినట్లయినసమఫలంబగునంద్రు వెగతియైయుండినగలిమి జెరుచు
హరిదశ్వుడస్త్రాద్రి నుంగమించినవేళ నట్టిఘాతంబులో నంబు వెలయ.

గీ. నుంచిసూర్యోదయంబున నెమ్మిజూచి। గొన్నియుండిన నడుసైనగూ
ర్చుశుభము । ఘమను లేకున్న నెట్టిలుబాసియున్న । దగటుభూమిని
యిండ్లకుదానవారి.

తా. గృహయజమానునియొక్కమూరెడు సలుచదరముగ మూ
రెడుండునట్లు కొలిచిత్రవ్వి మరల నామన్నుచే గుంటను బూడ్చగా త్రో

లువటియున్నమిగిలితేసుభకరము, సరిపోయెనేని సమఫలము, చాలకపో యెనేని దారిద్ర్యము కలుగును. ఆగుంటయందు సూర్యాస్తమయపు సమ యంబునందాగుంటనిండునటుల నుదకమునుబోసి మరునాటిసూర్యోదయ కాలంబునజూడవలయును అప్పటికాగుంటయందు జలముండినను బురదగా యున్నను శుభంబుకలుగును. పదును లేకుండగ నెర్రలుబారియుండెనేని యాభూమియందు గృహమును కట్టరాదని తెలియదగును. కాలామృతం బునందును, 'శ్లో. ఖాత్వాగర్తమరత్నిమాత్రమథ తాంపూర్త్వాసంపునః పూరయేద్యన్నూనాధికతాసమాత్తు సమదానవద్ధిస్తువృద్ధిప్రదా। తోయం రాత్రిముఖేప్రపూర్యఖననేతత్రయివహిత్వామృదం తత్స్వాదిసుఖదంజలం త్వనసనమఖంకోరజోమృత్యుకృత్. అనగాపిడికెతక్కువ మూరెడుగల్లమును త్రవ్వి యాపల్లమునుదానిమట్టిచేభూడ్వగా బూడ్చినమన్ను తక్కువయ్యె నేని యాస్థలంబునవిండ్లుకట్టువానికికీడుకలుగును. సరిపోయినసమఫలముని చ్చును, అధికమయ్యెనేని వృద్ధికలుగును. ఆపల్లమునందు ముందునాడు సాయంకాలమున జలముబోసిమరునాడుదయంబునజూడగ నుదకముండెనే ని సుఖప్రదముగును. బురుసుగానుండిన దారిద్ర్యముకలుగును. ద్రవ్యగా నుండిన మృత్యుప్రకలుగును. కావుననీవిధంబుగ బరిశీలించి గృహనిర్మా ణంబుచు జేయుటకుచితము.

### జలావార్తలక్షణము.

గీ. నీళ్లుపాలునుగుంటలోనుంచునపుడు। సరవిప్రదక్షిణంబుగాదిరిగెనేని।
కామధేనువీతినాభూమిగర్త। కిప్సితార్థంబులొసగునూన్చునిందిరేశ.

తా. నీళ్లును బాలునుబోయునపుడు ప్రదక్షిణక్రమముగదిరిగెనేని యాప్రదేశము కామధేనువలె కర్తకు నానావిధములైన శుభములను కలుగజేయును.

### హస్తప్రమాణనిర్ణయము.

సీ. అడ్డంబుగాయవలెనిమిదొకటిగనిడనంగుళంబగునట్టియంగుళములు।
ముప్పదిరెండైన మొగికిష్కువనందగునది ప్రాకృతుయిండ్లకలరుగొల్వ
ముప్పదినాల్గైనమొనయుప్రాజాపత్య మది వైశ్యశూద్రులసదనముల
నుముప్పదారింటనుచొప్పడుధనువనునది బ్రాహ్మణక్షత్రియాదిమతము

గీ. ముప్పదెనిమిదింటనొప్పుధనుర్గ్రహి। మదిసులాలయములకమరుగొల్వ।
గుణనచేసిహస్తమ్ములగీకీతి। సిన్నయంబుశాస్త్రమతముకృష్ణ.

తా. అడ్డంబుగ నారు యవలను దొంతిగ నిడిన నెంతపొడవగునో యది యంగుళమనిపించుకొనును. అట్టి యంగుళములు 32 ముప్పదిరెండయ్యేనేని యది కిష్కువను సంజ్ఞగల హస్తమగును. అట్టి కిష్కుహస్తంబుచే ప్రాకృతులగృహంబుల గట్టవచ్చును. ఇట్టి కిష్కుహస్తంబుమీద రెండంగుళంబు లెక్కించినది ప్రాజాపత్యమని యొప్పబడును, ఇట్టి ప్రాజాపత్యమను హస్తంబుచే వైశ్యులయొక్కయు శూద్రులయొక్కయు గృహంబులను కట్టవచ్చును. ఈ ప్రాజాపత్యమను హస్తంబు మీద రెండంగుళంబు లెక్కించినది ధనువను హస్తమగును. ఈ ధనువను హస్తంబుచే బ్రాహ్మణ క్షత్రియుల గృహంబులను కట్టవచ్చును. ఇట్టి ధనువను హస్తంబు మీద రెండంగుళము లెక్కించితే యది ధనుర్గ్రహమని యొక హస్తమగును. దీనిచే దేవాలయాదులను గొలువవలయునని తెలియనగును.

సీ. అడ్డమెనిమిదియవలవియంగుళంబగునంగుళాల్పండ్రెండు వితస్తి।
ఇవిరెండుహస్తమానిట్టిమా ప్రభేదముల పొడవంగుళంబనిను యవదియు
మానాంగుళంబని మనుజునిమధ్యవ్రేలి మధ్యమాంగుళపర్వమధ్యంబు।
మాత్రాంగుళంబగునాఁ యును నిరువదినాల్గైన హస్తాఖ్యమునరయందు.
గీ. నిట్టిహస్తంబులను భూమి నెలమిఁ గొలిచి పొడవు వెడలుపు గుణియింప నేర్ప
డు పదంబు లఖిలజాతులకిది యనుచు వ్యాసముని వాస్తుసిద్ధాంతమిది వారిజా

తా. అడ్డంబుగ నెనిమిది యవలు దొంతిగ బెట్టితే యది యెంతపొడవగునో యది యంగుళమనిపించుకొనును. అటువంటి యంగుళంబులు 12 పండ్రెండయ్యేనేని వితస్తి యని చెప్పబడును. అట్టి వితస్తులు రెండయ్యేనేని యొక హస్తమగును. సన్న వడ్లగింజలు నాలుగు నిడుపున బెట్టితే యెంతపొడవగునో యది యంగుళమనిపించుకొనును. యిరువది నాలుగయ్యేనేని యొక హస్తమనిపించుకొనును ఇది మానాంగుళప్రమాణము. ఇట్టి హస్తంబుచేత నిండ్లగొలువవలయును. నడిమి వ్రేలినడిమి గెరమధ్యము మొంతపొడువగునో యదియంగుళమనిపించుకొనును. ఇటువంటి యంగుళంబులు యిరువది నాలుగైతే మాత్రాంగుళహస్తమనిపించుకొనును. ఈ మాత్రాంగుళహస్తంబుచేత యజ్ఞశాలలు గొలిపించవలయును. ఇటువంటి 4 హస్తంబులుచేత భూమిని గొలిచినిడుపు వెడల్పులు బెంచితే పదమనిపించుకొనును.

క. ధరణీసురులకు రాజుల। కరుదండమును వైశ్యులకు।
ధరణీశ క్షభూజులకు। జరిగెను పూదండముగ దెలియఁగ కృష్ణా.

ల్లుగట్టులేలాగుఘరంశికృష్ణా.

తా. గృహంబుకుగట్టవలచిన భూమియందు మోన్నతములులేక యుండునట్లు చదరముజేసి ప్రాచీసాధనశంకునునిలిపి యాశంకునుపెల్లి గించగా మొదలనాటుకొన్న గురుతు గానవచ్చును. ఆ గురుతుయందు సన్నపాటి మొలకదించి యామొలకకు శంకుయెంతపొడవో యెంతపొడవు సూత్రంబు వుండేటట్టుకొలిచి ఒక్కడ నాటిన మొలకకుకట్టి వలయాకారంబుగాచుట్టితే శంకు విగణితవృత్తముకపించుకొనును. అంతట భూమిని నాటిన మొలకకేసు యాగురుతున ప్రాచీసాధనశంకును నిల్పి రేపటివేల ఆ శంకుకొన నీడయొక్క యుత్తరపురేఖ యెక్కడ సోకుచున్నదో యచ్చోటను గురుతుగా బిందువుబెట్టి మాపటివేళ శంకునీడవృత్తరేఖను యెక్కడసోకుచున్నదో అక్కడను గురుతుగా బిందువునుబెట్టి యీ బిందువులకుమాత్రము జక్కగాజుట్టితే తూర్పు పడమరలగును. ఆ తూర్పు పడమరల బిందువులు నడుమను వుండేటట్టుగాజూచి వృత్తములు జుట్టితే మొదలవృత్తములలో మత్స్యరేఖపుట్టును; ఆమత్స్యముఖ పుచ్చములకు చక్కగానుత్తరపురేఖను సోకేటట్టుగా మాత్రమునుజుట్టి అక్కడనుబిందువులుంచగా నది దక్షిణోత్తరములగును; ఆదక్షిణోత్తరబిందువులకు పడుమ వృత్తబులుజుట్టితే నాలుగుమూలల లేర్పడును; ఈవిధంబుగా ప్రాగ్దిక్కుసాధించి యిండ్లుకట్టిన యెడల సకల శుభంబులును జరుగును; దిక్శోధనముజేయక గృహంబులు కట్టినా [illegible].

[illegible]

సీ. పిప్పసూత్రంబు[illegible] | నారికేళసూత్రంబు[illegible] | [illegible]గును | [illegible]

తా. [illegible] సూత్రము శ్రేయస్కరము; [illegible] వైశ్యులకు తాటి నారసూత్ర[illegible] సూత్రము[illegible] దము; [illegible] సూత్రము[illegible]యని తెలియవలయును.

[illegible] | [illegible]చినదసూత్రముజా |
[illegible] | [illegible]సూత్రమితరవర్ణములకగున.

తా. ముసిబడకుండునట్లు ముప్పురిబెట్టినత్రాటిచే యొక్క వెలికొనలా వుగనుండవలయును ఆట్టిత్రాటిచే దేవాలయంబును బ్రహ్మక్షత్రియ గృహంబులనుకొనవలయును.
రెండుపేటలుగలత్రాటిచే వైశ్యశూద్రులగృహంబులనుకొలవవలయును.

శంకుకూటసూత్రలక్షణము.

గీ. పిడికెడువలంబుమూరెడుపొడుపునగుమొదలుకుసిచేసి డాకేలిముష్టిబ
ట్టియష్టవారములపల కేల వాష్టిముగఘట్టనము ప్రాఙ్ముఖోదఙ్ముఖముగవలయు

తా. సారవంతమైనది గాపిడికెడువలయముమూరెడు పొడవునుగల దారువును దెచ్చి మొదలుకుశిగా జేసి యాదారువును యెడమచేతబట్టుకొని కుడిచేతకూటంబును బట్టికొని పూర్వముఖంబుగానయిన నుత్తరముఖముగానయినను వంగి వానినిలిపి వానిచేత యాభూమియొక్క కోనప్రదేశంబులయందు సూత్రశంకువుల నిలిపి యెనిమిది పర్యాయములు కుడిచేతియందుండునట్టి కూటముచే నడువవలయును.

సూత్రంబునుబట్టులక్షణము.

క. భిత్తికిలోనగునిండ్లకు । భిత్తికివెలిదేవదులకు భిత్తికినడుమన్ ।
హర్మ్యప్రాకారంబుల । కీర్తింగునసూత్రనియతులెప్పుడుకృష్ణా.

తా. గృహంబులకుగోడలకులోపలి ప్రదేశంబునందు సూత్రంబును బట్టవలయును. దేవాలయంబులకు భిత్తికవలపలనుండి సూత్రంబును బట్టవలయును. ప్రాకారంబులకుబట్టునప్పుడు గోడయొక్కమధ్యప్రదేశంబుననుండిసూత్రంబునుబట్టవలయునని తెలియువలయు

శంకువునకుభగ్నత్వాదికఫలము.

సీ. ఆగ్నేయదిశశంకునంతకుదిశమూలు భగ్నమైనను దెగినబతికిహాని।
సురవైరిదిశశంకుపౌలస్త్యదిశమూలు భగ్నమైనను దెగినసతియుఁజచ్చు
పవమానుదిశశంకుపౌలస్త్యదిశమూలు భగ్నమైనను దెగినబ్రజకునష్టి।
పురహరుదిశశంకుపురుహూతుదిశమూలు భగ్నమైనను దెగినబ్రాణభీతి.

గీ. యగునునటుమూలమూల । సూత్రములు తెగిన శోకభయములు ।
దంపడలకుచు నిఖిలసుఖకరణి వాస్తుశాస్త్రగతులివసుధకృష్ణా.

తా. ఆగ్నేయపుదిక్కున శంకువును నాటునప్పుడు శంకువిరిగినను దక్షిణపుభాగమునందు సూత్రంబును బట్టునపుడు తెగినను గృహయజమానునకుహానికలుగును. శంకువును నిరుతిమూలయందు నాటునప్పు

డాశంకువువిఱిగినను, బడమటిప్రదేశమున బుట్టినసూత్రంబుదెగినను గృహస్థునియొక్క భార్య మరణంబునుజెందును. వాయవ్యపు దిక్కునందు నాటునపుడు శంకువువిఱిగినను కుబేరునిదిక్కునందు బుట్టిను నూలుదెగినను సంతానమునశించును. ఈశాన్యంబుననాటెడు శంకువిఱిగినను, దూర్పుభాగంబునందు బట్టునపుడు నూలుదెగినను బ్రాణహానిగలుగును. మూలలయందు సూత్రంబును బట్టునపుడు తెగినేని దంపతులకు శోకభయాదులు గలుగునని యెఱుగవలయు.

## శల్యపరీక్ష.

గీ. వర్గశుద్ధిగసూత్రముపట్టునపుడు । సూత్రమేజంతువులుదాటుసారి
దినచట । మహిని ద్రవ్వినమనుజప్రమాణమునను । వానిశల్యము
లుండునవశ్యముగను.

తా. వర్గశుద్ధియుతముగ సూత్రంబును బట్టునపుడు, ఆసూత్రమునేజంతువుదాటితే యావిషయమును జక్కగానాలోచించవలయును. అటుయోచించుకొనియాచోట మానుషప్రమాణములోతునత్రవ్వితే తొలుత దాటినజంతువుయొక్క శల్యములుండును. అనగా కుక్కదాటితే కుక్కశల్యములనియును, మనుష్యులుదాటితే మనుష్యశల్యములనియును, ఇటులనే సకలజంతువుల విషయములోగూడ చూచుకొనవలయును.

సీ. గోనకోసుసూత్రంబుకోడిదాటినదూర్పు దెసబక్షిశల్యముద్దేటపడును।
పిల్లిదాటినగానుపించుదచ్ఛల్యము లాగ్నేయమునలులాయంబుదాట।
శమునునిదెసమహిషంబుశల్యములుండునుసనిదాటనైఋతియునికిపట్టు।
వానిశల్యములుండువృషభంబు దాటగా బశ్చిమంబునవృషశల్యముండు।
వాయవ్యకడనురాసభముసంగతిదాటవానినెమ్ములువాయుదెసనునుం
డుమొనసిహాయముదాటదచ్ఛల్యముల్దనదుదిక్కునునుండుకాకిదాటినశ
శంకంబునెమ్ములీశాన్యముననుండునెలిమిశోమనుజుండు దాటినమధ్య
మస్థానమునమనుజులనెమ్ములుగనిపించునభ్యక్తుడటవచ్చి యేదిక్కు
నరసిచూడ। నచటదెబ్బదిమూడుమాత్రాంగుళములలోతునమానుష
శల్యముల్దోచు వెత్తివాడటకువచ్చి నిల్చునోజూడ మానవాస్థులుండున
శీత్రాంగుళాంతరమున.

తా. గృహంబునకుసూత్రంబునుబట్టునపుడు ఆసూత్రంబునుకోడిదాటితే తూర్పున బక్షిశల్యములుండును. పిల్లిదాటినటులైన నాగ్నేయం

బున బిల్లిమెముకలుండును. ఎనుబోతుదాటినటులైతే దానిశల్యంబులు దక్షిణపుదిక్కుననుండును. వృషభమను పేరుగల పసువుదాటితే పడమటిదిక్కున దానియొక్క మెముకలుండును. కుక్కదాటిన దానిశల్యములునిఋుతిదిక్కుననుండును. గార్దభముదాటినటులయితే వానిశల్యాంబులువాయవ్యపుదిక్కుననుండును. గుఱ్ఱముదాటితేదానిమెముకలు కుబేరుదిక్కుననుండును. కాకిదాటినటులయిన నీశాన్యపుదిశయందు కుందేటిమెముకలుండును. మనుష్యుడు దాటినటులయితే మధ్యమస్థానంబునంబు మనుజుల శల్యములుండును. తయిలాభ్యక్తుడయిన జనుడువచ్చి యేదిక్కునుజూచునో యాదిక్కున మానగశల్యములు 73 అంగుళములలోతుననుండును. వెఱ్ఱివాడువచ్చి అటునిలిచి జూచెనేని యచట 80 అంగుళములలోతున మనుష్యశల్యములుండును. యీవిధముగశల్యములబరీక్షించి చూడవలయును.

వర్ణాక్షర ప్రశ్నలక్షణము.

వ. సూత్రంబునుబట్టునపుడచ్చోటున కెవరైనవచ్చియావర్గపునసరించి,

సీ. ప్రశ్న చేసినపదంబుననిలిపిన తూర్పునగజపక్షుశల్యముల్గానుపించు । కవర్గోచ్చారణ ప్రశ్న చేసిన నాగ్నేయమున మేషశల్యంబులుండు। చవర్గోచ్చారణ ప్రశ్న చేసినదక్షిణంబున హస్తమాత్రముననను । మహిషశల్యంబులుండు ధృతిటవర్గపునుచ్చరింప బ్రశ్ననుసురహరణుదిశను। హస్తమాత్రంబునసునక రాసులునుండు తగదవర్గోచ్చారణ ప్రశ్న చేతపశ్చిమంబునను హస్తద్వయ మాత్రంబునను సర్పనక్రంబుల శల్యముండురహపవర్గాక్షరమానుత దెశహస్తమాత్రంబునను మూషకకురంగాస్థుసరవిచుండు । రమణయవర్గాక్షుర ప్రశ్న చేతనుత్తరంబున నిలివెటగరితురంగశల్యంబులుండు । రమణయవర్గాక్షర ప్రశ్ననీశునిదెస బాహుమాత్రగితాంతరమున గనుపించు శశవృషశల్యముల్వగాంత సమిత నుచ్చరించి. బ్రశ్ననుదగ బరీక్షించనచటశల్యములు లేవు గావున జగతిశల్య। శోధనము జేసిరచియింప శోభనంబు మూథగతిగట్టరాదంద్రుముులవిదారి.

తా. సూత్రంబునుబట్టి కొలుచునట్టి సమయంబునందు ఆజోటున కెవరయిననువచ్చి అఆఇఈఉఊలనుఅక్షరంబులు మొదలుగాగల నామములనుచ్చరించి ప్రశ్నను జేసినటులయితే తూర్పున మనిషిలోతున దొవ్వితే

యేనుగుఎముకలైనను ఒష్ఠిఎముకలైనను నివసించియుండు. కఖగఘఅనుఅ క్షరంబులనుచ్చరించి ప్రశ్నసుజేసినట్లయితే యాగ్నేయంబున జేతెడులో తున బొట్టెటియొక్క ఎముకలుండును, చఛజఝఅను నక్షరంబుతొలియ క్షరములుగాగల నామంబులనుచ్చరించి ప్రశ్నను జేసినట్లయితే దక్షిణంబు న జేతెడులోతున మహిషశల్యంబునుండును, టఠడఢఅనునక్షరములాద్యక్ష రంబులుగాగల నామములనుచ్చరించు ప్రశ్నను జేసినట్లయితే నైరుతిదిక్కు నందు జేతెడులోతునకుక్కయొక్క శల్యంబులయినను మానవశల్యములై ననుండును. తథదధ అను నక్షరమును తొలియక్షరంబుగాగల నామంబు లనుచ్చరించి ప్రశ్న జేసినట్లయితే పశ్చిమపు దిక్కున రెండుచేతులలోతున సర్పశల్యంబులుండును. అట్లుకాదేని కాఉమొసలియొక్క ఎముకలయిన వుండును. పఫబభయను నక్షరము లాదిశయందుగల నామంబులనుచ్చరిం చి ప్రశ్నను జేసినట్లయితే వాయవ్యపుదెస జేతెడులోతున శునకశల్యము లయినను లేడియొక్కశల్యంబులైనవుండును. యరలవఅనునక్షరములుతొ లి యక్షరంబులు గాగల నామంబుల నుచ్చరించి ప్రశ్నను జేసినట్లయితే కు బేరునిదిక్కునందు నిలివెడులోతున గజశల్యంబులైనను గుఱ్ఱముయొక్క శల్యంబులైననుండును. శషసహ అనునక్షరములుగల ప్రశ్నను జేసినట్లయి తే యీశాన్యపు దిశయందు జేతెడులోతున కుండేటి ఎముకలైనను గో వుయొక్కఎముకలైన నుండును. ఙఞణవమఅనునక్షరంబుగల ప్రశ్నను జే సినట్లయితే యేదిక్కునందును నెముకలులేవని యెఱుగవలయును. కాబ ట్టి ముందుగభూమినిశోధించి పిమ్మట గృహంబును నిర్మించుట యుత్తమ ము. భూమినిశోధింపక గృహనిర్మాణంబును జేసినవారు గొంతకాలంబు నకు క్రమ క్రమంబుగ నశించుదురని తెలియవలయు.

మ. సుమతుల్శల్యములిందులేవుగదయంచున్ప్రశ్నగాబల్కుద।
త్సమయంబాసవాస్తువేదివెనరిబాదచ్ఛాయులందంతినే।
త్సములంగూరిచిభానుసంఖ్యనిరవద్యంబెంచివటోస్మభా।
గముగావింపక శేషసంఖ్యఫలమార్గణంబుల్భావించంపందగుఙ్.

తా. గృహంబునకు ఆవరణను ఏర్పరుచు సమయంబునందు వృ ద్ధులగువారువచ్చియీభూమియందు శల్యంబుగలవా, లేవా, యనిప్రశ్న ను చేసినట్లయితే వాస్తుశాస్త్ర వేత్తయగు మానవోత్తముడు సేయదగిన కృత్యంబును జెప్పెదను. అనగా బాదచ్ఛాయలువేసి వానితో నిరువదెని

మిదింటినికూర్చి పదిరెంటగుణించి పదునారింట భాగహరింపగా మిగిలిన సంఖ్యనుబట్టి ఫలంబును జెప్పవలయును.

సీ. శేషమేకాంతరాచితవృద్ధిప్రాగాది దిశలపదారింట దెలియవరుస।
ఇలనుండునుకపాలమిటకయు బెంకులు కట్టెలుదేవసంఘములనెలవు।
బూడిదెశవమునుబొగ్గులుధాన్యంబ ధనముపాషాణంబుదర్గుణంబు।
గోశల్యసమితియుగుక్కనెమ్ము పిశాచముభూతసంస్థాపనంబు.
గీ. ప్రశ్నలక్షణమీరీతిజరిగియుండు। గావునధరిత్రిశోధింపగాబొసంగు।
వెలయునిందుశుభాశుభంబులనుదెలిసి।యిండ్లుగట్టినదత్ఫలంబెనగుకృ.

తా. ఇదివఱకు జెప్పిన పద్యములోని శేషసంఖ్యకు ఫలంబును జెప్పుచున్నాడు. అదెట్లనగా, 1 మిగిలితే తూర్పున దలపుఱ్ఱెయుండును. 2 మిగిలినటులయిన దూర్పునకును నాగ్నేయంబులకునునడుమ యిటుక యుండును. 3 మిగిలినట్లయిన యాగ్నేయదిగ్భాగంబున బెంకులుండును. 4 మిగిలినట్లయిన నాగ్నేయంబునకును దక్షిణదిగ్భాగంబునకును మధ్యప్రదేశంబునందు గట్టెలుండును. 5 మిగిలినట్లయిన దక్షిణదిగ్భాగంబునందు దేవతలుందురు. 6 మిగిలిన దక్షిణదిగ్భాగంబునకును నిరుఋతిదిగ్భాగంబునకును మధ్యప్రదేశంబునందు భస్మముండును. 7 మిగిలిన నిరుఋతి మూలయందు శవముస్థాపింపబడియుండును. 8 మిగిలిన నిరుఋతిభాగంబునకును పశ్చిమదిక్కునకును నడుమ బొగ్గులుండును. 9 మిగిలిన పశ్చిమదిగ్భాగంబునందు ధాన్యముండును. 10 మిగిలిన వాయువ్యంబునకును పశ్చిముపుదిక్కునకును మధ్యప్రదేశంబునందు ధనముండును. 11 మిగిలిన వాయువ్యపు దిగ్భాగంబునందు పాషాణంబులుండును. 12 మిగిలిన వాయువ్యమునకును కుబేరదిగ్భాగంబునకును మధ్యప్రదేశంబునందు గప్పలుండును. 13 మిగిలిన నుత్తరపుదిగ్భాగంబున గోశల్యంబులుండును. 14 మిగిలిన నీశాన్యంబునకును నుత్తరమునకును మధ్యప్రదేశంబునందు గుక్కయెముకలుండును. 15 మిగిలిన నీశాన్యదిగ్భాగంబున పిశాచము నివాసమైయుండును. 16 మిగిలిన నీశాన్యంబునకును దూర్పునకును మధ్యప్రదేశంబునందు భూతస్థాపనమైయుండును. ఈవిషయంబునకు సర్వంబునకును బైపద్యంబులయందు ఫలంబును జెప్పుచున్నాడు.

గీ. రమణతోభూమిశోధించు సమయమునను। నిటుకతాబేలుబియ్య
ముయిసుకకప్ప। రాళ్ళుగోశృంగములుగన్నబ్రబలుభాగ్య। మ

నుచుజెప్పిరిమునివర్యులంబుజాక్షి.

తా. భూమిని శోధించు సమయంబునందు యిటుక, తాబేలు, బియ్యము, కప్పురాళ్ళు, గోవుయొక్క కొమ్ములు మొదలగునవియున్న శుభంబుగలుగునని తెలియదగును.

క. కలహమగుపెంకులుండిన। వెలిమిడిరోగంబుబుట్టుపేదరికంబున్।
బొగ్గుమృతికట్టెలగ్ని। జ్వలితముకులనాశనంబుశల్యములభవా.

తా. భూమిని శోధించుసమయమునందు బెంకులుండిన గలహము కలుగును. బూడిదెయుండిన రోగంబుకలుగును. పొట్టుకలిగియుండినదారిద్ర్యంబుకలుగును. బొగ్గులుండినమృత్యువుకలుగును. కట్టెలుండినఅగ్నిబాధకలుగును. యెముకలుండిన కులనాశముకలుగును. కావున నిట్టిదోషములులేకుండునట్లు గృహనిర్మాణమును జేయవలయును.

భూశోధనను జేయక గృహంబును గట్టుటకు ఫలము.

సీ. భూశోధనము లేకపూనిగృహములు గట్టియుండినజెందుననట్టిఫలము।
దెల్పెదబశువులుగలిగియుండియు నింటబాడిలేకుండినబాలశల్య।
ములుదూర్పుదెసనందునిలపతులే ప్రొద్దుకోపంబు జేసినగుఱ్ఱెముముక।
లాగ్నేయమునసుండునహరహంబు జ్వలతాపములగ్గలినదంతిశల్య।
ములునుండుదక్షిణంబునబుణంబులచేత సుడిబడియుండినసూకరశల్య।
ములునుండురాక్షసునిదిక్కునమృత్యు దోషంబులనిశమ్ములించెనేని।
వృషభశల్యములుండువెసలక్షుమంబునగ్రామంబులో బ్రజల్కలహమం
ది।యూరువెడలుమటంచుబోరినగార్దభ శల్యముల్మారుతస్థలినుండు।
నర్థనాశనముప్రత్యహముగల్గినమేషశల్యములుండువయిశ్రవణుదెసను
పోరుగులెప్పుడుచాలపోరుచుండినగాని యీశాన్యమునశ్వానమెముక
లుండు।నింటిలోగలహంబుయేప్రొద్దుగలిగిననట్టింటనుండునరునిశిరము.

గీ. ఇదివిచారింపవలసినట్టిచోట్ల। వాఋజానలు వెడలపునంతలోతు।
త్రొవ్వియదిశోసివేయ కర్తకులభించు। నాయురారోగ్య భాగ్యం
బులంబుజాక్షి.

తా. భూమిశోధించక గృహంబుకట్టుటకు ఫలమునునిరూపించిచెప్పెదను. పశువులుగలిగియునుపాడిలేక యుండెనేని శిశువుశల్యములుతూర్పుననుండును. గృహస్తునియజమానుడు సర్వకాలంబులయందును నాగ్ర

హామును జెందుటసంభవించెనేని గుఱ్ఱపుశల్యములాగ్నేయమునందును. ఎల్లప్పుడును రోగముగలిగియుండుటసంభవించెనేని యేనుగు నెమ్ములుదక్షిణపుదిక్కునందును. సర్వకాలములయందును ఋణబాధలుగలిగియుండెనేని పందియెముకలు నైరుతిదిక్కునవుండును. ఎప్పుడును అపమృత్యుదోషములుకలిగియుండెనేని పడమటిదిక్కున వృషభశల్యములుండును. గ్రామములో ప్రజలుకలహము సేసి యూరువెడలగొట్టుటకుయత్నించిరేని పొట్టేటి యెముకలు ఉత్తరపుదిక్కునవుండును. ఇంటియందు నిరతంబుగ గలహములు జరుగుచుండెనేని నట్టింట నరుని తలచిప్పయుండును. కావున నీవిధంబుగా శోధించి భూమియందుండునట్టి యెముకలనుదీసి వేసినపిమ్మట గృహయజమానునకు శుభంబులుకలుగుచుండును. ఈవిషయము మఱియొకవిధంబుగా జ్యోతిర్నిబంధనమనుగ్రంథమునందు చెప్పబడినది. అదెట్లనిన:—

శ్లో. స్పృష్ట్వేష్టదేవతాం ప్రష్టుర్వచనసాద్యమక్షరం। గృహీత్వాతుతతశ్శల్యాశల్యంశమ్యగ్విచార్యతే। పృచ్ఛయాయదితన్నిఘాబ్యాం నరశల్యంతదాభవత్। శార్ధహ త్తప్రమాణేన తచ్ఛమానవమృత్యుకృత్॥ అగ్నేయాందిశికః ప్రశ్నే ఖరశల్యంకరద్వయే। రాజదండోభవేత్తత్ర భయం నైవనివర్తతే॥ యామ్యాయాందిశిచః ప్రశ్నేకుర్యాదాకటిసంస్థితం। నరశల్యంగృహేనస్య మరణంచిరరోగతః॥ నైరుత్యాందిశిచః ప్రశ్నే సార్థహస్తాదధఃస్థలే। సునోస్థిజాయతేతత్ర బాలానాంజనయేస్మృతింతః॥ ప్రశ్నే పశ్చిమాయాంతు శిశోశ్శల్యంప్రజాయతే। సార్ధహస్తేగృహస్వామి నతిష్టతిసదాగృహే॥ వాయవ్యాదిశిపః ప్రశ్నే తుషాంగారాశ్చతుఃకరే। కుర్వంతిమిత్రనాశంచ తదాదుస్స్వప్నదర్శనం॥ ఉదీచ్యాందిశియః ప్రశ్నే విప్రశల్యంకటెరధః। తచ్ఛీఘ్రంనిర్ధనత్వాయకుబేరసదృశస్యహి॥ ఈశాన్యాందిశివః ప్రశ్నేగోశల్యంసార్ధహస్తతః। తద్గోధనస్వనాశాయతే గృహమేధినః॥ హలయామధ్యమేకోష్టేపక్షోమాత్రేభవేదధః। నృకపాలమత్రోభస్మలోహంతత్కులనాశకృత్॥ అనగా పృచ్ఛకుడువచ్చిమీగృహమునందు శల్యములేమైనగలవాయని ప్రశ్నను జేయు సమయమునందు ఆవర్గులోనేదైననొక్కయక్షరముప్రశ్నాద్యక్షరమయ్యెనేనిగృహంబుయొక్కతూర్పుదిక్కునందు నరశల్యముమూడుగజంబులోతుననుండును. అట్టి శల్యములున్నగృహమునందు సర్వకాలంబులయందును మృత్యుభయంబు గలుగుచుండును. ఇట్టిభయములుబహుపర్యాయములు కలుగుచుండెనేని

గృహంబునందుశల్యములుండియుండునని యెఱుగనగును. ఈవిధముగానే క్రిందజెప్పబోవు విషయములకును గూడ తెలియవలయును. ప్రశ్నాద్యక్షరము కవర్గులోనిదియైననొకటియైనేని యాగ్నేయదిక్కునందు రెండు హస్తములలోతున గాడిదెయొక్క శల్యములుండును ఈశల్యంబులుండుటచేత విశేషంబుగ రాజదండనగలిగి యుండును. చవర్గప్రశ్నను జేసెనేని మొలలోతున దక్షిణపుదిక్కునందు నరశల్యంబులుండును. అట్టిశల్యంబులుండుటవలన జిరకాలపు రోగంబువలన గృహయజమానునికి మరణంబు గలుగును. గవర్గప్రశ్న చేసెనేని మూడుగజంబులలోతున నిఋఋతిదిక్కునందుకుక్క యెముకలుండును. ఇట్టియెముకలు గృహంబునందుండుటచేత సర్వదా బాలురకు మరణముగలుగుచుండును. తవర్గప్రశ్నను జేసెనేని మూడుగజంబులలోతున బశ్చిమదిక్కునందు శిశుయొక్క శల్యంబులుండును. ఇట్టిశల్యంబులు గృహంబునందుండెనేని గృహయజమానుడు నిర్వ్యాపారంబుగ నితరులగృహంబులయందుగాని యితరదేశములయందుగాని సంచరించుచుండును. పవర్గప్రశ్నను జేసెనేని వాయవ్యపుదిక్కునందు హస్తప్రమాణమున ఉముకయు బొగ్గులుండును. ఇట్టివస్తువులుండుటచేత మిత్రనాశమును, దుస్స్వప్నదర్శనమును గలుగుచుండును. యవర్గ ప్రశ్నను జేసెనేని యుత్తరపుదిక్కునందు మొలలోతునకు గ్రింద బ్రాహ్మణశల్యములుండును. అట్టి శల్యములుండెనేని కుబేరునివంటి ధనవంతుడు గూడ శీఘ్రకాలములోన దరిద్రుడగును. శవర్గప్రశ్న చేసెనేని యీశాన్యపుదిక్కునందు మూడుగజములలోతున గోశల్యములుండును. అట్టి శల్యములుండుటచే బహుధనమంతయును నశించుచుండును. హవర్గములను ప్రశ్నము జేసెనేని గృహమునకు మధ్యమ ప్రదేశమునందు రొమ్ములోతున నరకపాలములుండును. అట్లుకాదేని భస్మము మొదలగువస్తువులుండును ఈవస్తువులుండుటచేత గులమంతయును నశించుచుండునని యెఱుగవలయును. ఈవిషయమును సర్వమును దెలిసికొని భూశోధనను జేసి యెమ్ములనెత్తివేయుట యుత్తమమని యెఱుగవలయును. ఈ ప్రశ్న ఫలములు దైవోపాసకుడును, సత్యాహింసావ్రతుడును అగు జ్యోతిష్కుడు స్వేష్టదేవతను ప్రార్థించి చెప్పునటులయిన జక్కగా ఫలించును. అట్లు కాదేని యవమానమునకు బాత్రుడగునని యెఱుగవలయును.

కుశావర్తనలక్షణము.

ఉ. వర్తనలు నేడుజానలు దివౌకసగేహములం ధరన్ గనా।
వర్తన చేయు విప్రులకు షణ్మితి సమ్మతి రాజగేహముల్।
స్ఫూర్తిగ నెప్పుడుం దుమతి సొంపుగ నాల్గిట వైశ్యసద్మము।
గీర్తిద మానుశూద్రులకొదిన్విసమూటను గేహముల్లసీ.

తా. దేవాలయముల కేడుజాణలలోతు త్రవ్వవలయు. బ్రాహ్మణుల గృహముల కాఱుజాణలలోతు త్రవ్వవలయును. రాజగృహములకై దుజాణలలోతు త్రవ్వవలయును. వైశ్యగృహములకు నాలుగుజాణలలోతు త్రవ్వవలయును. శూద్రగృహములకు మూడుజాణలలోతు త్రవ్వవలయునని యభిప్రాయము.

క. మునుపు కుశావర్తన జే। సినఘాతమునించురీతి జెప్పెద రాళ్లు।
స్థనరగ నిసుకను జలమును। నెనయగ శాస్త్రోక్తమార్గమిది వనజాక్షా.

తా. కుశావర్తనను జేసినపిమ్మట నరలఘాతమును బూడ్చునట్టి విధము దెలియజేయుచున్నాడు. అదెట్టిదనిన ముందర రాళ్ళను బరపవలయును పిమ్మట నిసుకను బోయవలయును అటుపిమ్మట నుదకము బోయవలయును. ఈవిధముగ ఖాతమంతయును పూడువఱకును జేయవలయును. మఱియును దక్షిణోత్తరములయందు గొంచమెత్తుగ నుండునట్లు సేయావలయును.

జలగలిలక్షణము.

సీ. అన్యగేహజలంబు నాత్మగేహంబున గణ్యమయి వచ్చిన కలహ మెదవు।
తనయింటి నీళ్లు బాదూర్పు దెసనేగ బుత్రలాభం బెపుడు పొసగ చేయు।
నాగ్నేయమున నర్థహాని సంపాదించు మెరసి దక్షిణమున మృత్యుభయము
రాక్షసేశుని దెస రాజభయంబగు బశ్చిమంబున గేడుపత్నికొదవు॥
గీ. పవనుని దెసనష్టి పశువుల కెప్పుడు। ధనదుని దెసగల్గు ధనసమృద్ధి।
శివుని కోణమునందు శివకరంబగు। నీటనింకెనేని పొసగదిందిరేశ.

తా. ఇతరులయింటినీరు తనయింటికి వచ్చెనేని కలహమును హానియును సంభవించును. తన గృహము యొక్క నీరు తూర్పుభాగంబుగ బోయెనేని పుత్రలాభము కలుగును. ఆగ్నేయదిశకు బోయెనేని ద్రవ్యహాని కలుగును. దక్షిణముగ బారెనేని మృత్యుభయము గలుగును. నిరుఋతిభాగమున బ్రవహించెనేని ద్రవ్యహానికలుగును. పశ్చిమభాగముగ బ్రవహించెనేని భార్యకుకీడు సంభవించును. వాయవ్యదిగ్భాగమున బ్రవహించెనేని పశు

భూతమునకు 5, కులమునకు 4, లగ్నమునకు 12, ఈ ప్రకారము మిగ లకపోయెనేని యీచెప్పిన లెక్కలను గూడుకోవలయునని తాత్పర్యము. ఈవిషయము కాలామృతమునందు 'శ్లో. ఆయామేనవిశాలమేనగణయే క్షేత్రీకృతంయత్పదం। నాగాస్కయిస్స్వమ్పుణంభవే త్రిరికరభిర్వారోకం శయిలేర్దినం ॥ షట్త్రింశేనభః సుష్టభయిర్నవగజయిరా। యోంకాఖాంక యిర్వతా స్వాంశమ్షణ్ణవభి స్తదేవ విభజేదాయుగర్ణజయిద్దిక్పతిః॥' అవతా రిక. గృహముకట్టెడు స్థలములకు ధనము, ఋణము, వారము, దినము, నక్ష త్రము, ఆయము, ఆయుస్సు, అంశము, దిక్పతులనియెడు నవవర్గగణితక్ర మమును జెప్పుచున్నాడు. తా. గృహముకట్టెడు ప్రదేశముయొక్క ని డుపునుగొలిచి యేర్పడిన సంఖ్యచే వెడల్పుసంఖ్యనుగుణింప నాసంఖ్యకు క్షేత్రీకృతపదమనునామముగలిగె. అట్టిక్షేత్రీకృతపదసంఖ్యనుముందువ్రా యగల సంఖ్యలచే దొమ్మిదిమారులు గుణించి తొమ్మిదిమారులు భాగహ రింపగా మిగిలినసంఖ్య ముందుచెప్పిన ధనరుణాదినవవర్గలగును. అట్లువ ర్గజ్ఞాపకముకై పయినవ్రాయబడు సంఖ్యలలో మొదటియంకె గుణ కమనియు, రెండవయంకె హరణమనియు; తెలిసికొని గుణించిరేని నవవ ర్గగణితమేర్పడును. గుణకము 8 హరణము 12, ధనము 3-8, రుణము 6-7, వారము 9-30, [illegible] నక్షత్రము 6-8, అయము 9-120, వయస్సు 6-9, అ[illegible] యుస్సంఖ్య 8 భాగహరింపగా శేష ము దిక్పతియని[illegible] తాత్పర్యము. ఈ కాలామృతశ్లోకము నందు జెప్పబడి[illegible] ... గ్రంథమునందు జెప్పబడినది యేకాదశ[illegible] ...తము సకలజనులును ననపుగాను నే యీ గోచి[illegible] ...శవర్గగణితమును తరుచుగా నాలోచించు

...ములకును ప్రత్యేకముగ ఫలమును జెప్పుట.

...నము. [illegible] ...త ధనరుణదివసవారతారా యోగకరణాయుష్యదిక్పతి భూతలకు లగ్నంబుల శుభాశుభంబులు సెప్పుక్రమంబునువివరించెద. తా. ఇప్పుడు సెప్పినపదునొకండు వర్గములకును దగినఫలమును జెప్పుచున్నాడు.

క. ధనమెక్కుడైనధనికుడు । రుణమెక్కుడైనగ రుణవంతుడగుర్ణ ।
ధనరుణములు సరియైనను । వినుమాశాయంబుకొలదివెచ్చముకృష్ణా.

తా. ధనమధికముగనుండి రుణముతక్కువయ్యెనేని ధనవంతుడగు

ను. రుణమెక్కువగనుండి ధనముతక్కువయ్యెనేని దరిద్రుడగును. (అన గా రుణవంతుడగునసుట) ధనరుణము రెండును సమముగ నుండెనేని యా దాయవ్యయములు రెండు సమముగనుండునని తాత్పర్యము. కాలామృత మునందును 'శ్లో. కస్తుశ్చేదధికంధనం శుభమృణాద్యద్యల్పమర్ధో సుభమ్. అని చెప్పబడినది, అనగా ధనరుణములలో ధనమెక్కుడయ్యెనేని రుణవం తుడగుననియును తెలియనగును.

ధ్వజాద్యాయనిర్ణయము.

సీ. పదమునిమిదింటచే బాల్గొన్న శేషం బొక్కటైనధ్వజంబౌనరుకృష్ణా।
రెండింటధూమంబుమూడింటసింహంబునాల్గింటగుర్కురమైదువృషభ।
ఖరముషట్సంఖ్యయుగజమేడటను కాక సెనిమిదినిమిగిలిన నెసగియుండు।
నింద్రదిశాదిగానాయంబులన్నియు కర్తనింద్రాదిదిక్పతులువరుస.

గీ. హరియుధ్వజమునుండు గేసరియుదొడరు। వృషముపైనుండుతనయుం డెవ్వృషమునుండు। ధూమమునదక్కనన్నిదొడరుధ్వజము। అవలిందద గుచోట్లనన్నిదిశల.

తా. పదమును యెనిమిదింటభాగహరింపగా నొక్కటిమిగిలిన ధ్వ జాయము, 2 మిగిలితే ధూమాయము 3 మిగిలితే సింహాయము 4 మిగి లితే శ్వానాయము. 5 మిగిలితే వృషభాయము. 6 మిగిలితే ఖరాయము. 7 మిగిలితే గజాయము 8 కాకాయము. ఇయ్యాయములకు నధిపతులను చెప్పెదను. ధ్వజాయమునకు నింద్రు డధిపతి. ధూమాయమునకు నగ్ని హోత్రుడధిపతి. సింహాయమునకు యముడధిపతి. శ్వానాయమునకు నిరుతి యధిపతి. వృషభాయమునకు వరుణుడధిపతి. ఖరాయమునకు వాయునధిపతి. గజాయమునకు గుబేరుడధిపతి. కాకాయమున కీశ్వరుడధి పతి. సింహాయమునకు కుత్తరమునగృహమును కట్టవచ్చును. సింహాయము నకు గజాయమునకును పశ్చిమపుదిక్కున గృహమునుగట్టవచ్చును. వృ షభాయమునకుఁ బశ్చిమపుదిక్కునేగాని మరియొక్కదిక్కున గట్టజనదు. ధ్వజాయమున కాగ్నేయమున గట్టరాదు. మిగిలిన దిక్కులయందు గట్ట వచ్చును. ధూమయమునకాగ్నేయమున గట్టవచ్చును. శ్వానాయమునకు నిరుతిదిక్కునయందుగట్టవచ్చును. ఖరాయమునకు వాయవ్యదిశయందు గట్టవచ్చును. కాకాయమున కీశాన్యమునగట్టవచ్చును. మరియొక్కదిక్కు నగట్టరాదని తాత్పర్యము. కాలామృతమునందు ధ్వజాద్యాయస్వరూప

ము తత్ఫలమును విపరీతముగ జెప్పబడినది. 'శ్లో. అయాస్యుర్ధ్వజ ధూమ సింహ శునకాడ వృషఖరాః గజః। కాకో... మరణంశ శ్చజయంచామయం। రాజ్యసుఖకరంసదా శుభకరంతస్మిన్ఫలంచక్రమా త్ప్రాగాదిష్వసిసంయుతాః గృహప తేదద్యుర్ధ్వజాద్యాఃఫలమ్.' 'శ్లో. పాదా దిక్యసమోధ్వజోయదిగజః పాదేసహీనస్సమః। పాదోనోవిషమోహరి విషమస్స్యాం... వృషాయోధనత్। ద్యాతాయస్థభవేచ్చగేహల సమ స్సాధోసమాయఖరశ్వాయస్స్యాద్విషమస్తుసార్ధసు సమోధూమ స్స్యాద్విత్వ్రరహ. తా. ధ్వజాయము, ధూమాయము, సింహాయము, శునకా యము, వృషభాయము, ఖరాయము. ఇవితూర్పు మొదలుగ నీశాన్య ది క్కువరకును, వరుసతప్పకయుండునేని గృహపతికి సత్ఫలమునిచ్చును. వ రుసదప్పెనేని క్రమంబుగనుత్పత్తి. మరణము, జయము, రోగము, రా జ్యము, దుఃఖము, శుభము, ఫలాభావము, యీఫలమును గలుగజేయు ననుట. ఇకను ధ్వజాద్యాయమును స్వరూపమును దెలియజేయుచున్నా డు. గృహమునకట్టుటకయి యేర్పఱచిన ప్రదేశమునందాయింటికి నిడివిగొ లవగా నాపరిమాణము పాతికె యధికముగా సమసంఖ్యగలదయియున్న ధ్వజాయమగును. పాతికె తక్కువగా సమసంఖ్యగలదయియున్న గజా యమగును. పాతికె తక్కువజేసి సంఖ్యగలదయియున్న సింహాయ మగు ను. పాతికెహెచ్చుగాజేసి సంఖ్యగలదయియున్న వృషభాయ మగును. హెచ్చుతగ్గులులేక సమసంఖ్యగలదయియున్న కాకాయమగును. అర్ధమ ధికముగ విషమసంఖ్య గలదయియున్న ఖరాయ మగును. కేవల విషమ సంఖ్య గలదయియున్న శునకాయమగును. అర్ధ శుతశయంబుగ సమ సంఖ్యగలదయియున్న ధూమాయ మగును. యీచెప్పబడిన ధ్వజాద్యా యములకన్నిటికిని వెడల్పు చతుస్సాంఖ్యాకముయి యుండవలయును. ఈ యాయంబులు ముందు జెప్పియున్న తెలుగుస దమ తమ దిక్కులయందు న్న శుభకరంబులునని తాత్పర్యము. (ఇట్లుధ్వజాద్యాయ స్వరూపంబులు ను భిన్నభిన్నంబుగ జెప్పబడినవి. కావున వీని నన్నింటినివిచారించి తగిన విధంబున నాలోచింపవలయును.)

క. ధ్వజసింహావృషభగజములు। నిజముగ వర్ధిల్లువిప్రపన్నపతులగృహముల్
ధ్వజవృషభగజాయంబులు। గజములుబలిజులకుదగుసరోరుహనయనా.

తా. ధ్వజాయసింహాయంబులు బ్రాహ్మణుల కును క్షత్రియులకునుబగు

వృషభాయధ్వజాయంబులు వైశ్యశూద్రులకు దగునని దెలియవలయును.

ఆయ ఫలము.

చ. ధ్వజముకృతార్థతం జెలగు తద్దయుమృత్యువొనర్చుధూమము ।
విజయము సింహమెన్నకడ వెళ్ళనిరోగము కుర్కురంబునన్ ।
నిజముగ రాజమావృషభమునిత్యము దుఃఖము రాసభంబునన్ ।
గజము సుఖంబొనర్చుమఱికాకమునిష్ఫలమంబ జానకా.

తా. ధ్వజాయముకృతార్థునిచేయును. ధూమాయముమృత్యుప్రద దమగును. సింహాయము విజయప్రదము. శ్వానాయము రోగ ప్రదము. వృషభాయమురాజ్యప్రదము. ఖరాయముదుఃఖప్రదము. గజాయము సుఖప్రదము. కాకాయము నిష్ఫలముగునని యును తెలియవలయు.

క. అకృతమగువేళి నాయము । నకుటిలమతిదీర్ణయింపనంగుళహీనా।
ఏకమైనపూర్ణఫలమున। సుకరంబుగనొందచేయు సుస్థిరసినతా.

తా. ఆయముల నిర్ణయించునప్పుడు అంగుళ మెక్కువైనను ద క్కువైనను పూర్ణాయఫలమునొసంగును. ఇకను ఆయములవలన ఋణ మునుదెలిసికొనునట్టి విధమును జెప్పబోవుచున్నాను.

గీ. ధ్వజమునకుమూడు ఋణమారునిజముధూమ । మునకునొక్కటిహరికి నాల్గయినశునికి। నేడుగవసంఖ్యఖరమున నెసగురెండు । గజమునకునై దువసుసంఖ్యకాకమునకు.

తా. ధ్వజాయమునకుమూడుఋణము ధూమాయమునకు నాఱు ఋణము సింహాయమునకు నొక్కటిఋణము శ్వానాయమునకు నాలుగు ఋణము వృషభాయమునకు నేడుఋణము ఖరాయమునకు రెండు ఋణ ము గజాయమునకు నైదుఋణము కాకాయమునకెనిమిదిఋణము ఇయ్యా యములకింతతక్కువనుదక్కువనుఋణమువచ్చుటలేదని యభిప్రాయము.

తిథి ఫలము.

గీ. శుద్ధపాడ్యమై శోకంబు సంధిల్లు। రిక్తదినములందు రిక్తుజేయు। దర్శ యంబుపతికి దప్పదుమృత్యువు । కడమదినములందు గలుగుశుభము।

తా. శుద్ధపాడ్యమి దుఃఖమును గలుగజేయును. చవితియును చ తుర్దశియును గృహనాశమును గలుగజేయును. అమావాస్యయయ్యె నేని గృహయజమానునికి మృత్యువుగలుగును. మిగిలినదినములు శుభ ఫలమునుగలుగజేయును.

### వారఫలము.

గీ. శుక్రసోమవారములు శుభకరములు । బుధబృహస్పతివారములొ్ప సగుధనము । సూర్యభౌములవారములొ్సకము । శనిదినంబుతస్కరహోయంబుజలజనాభా.

తా. ఏకాదశవర్గగణిత ప్రకరణమందు జెప్పఁబడిన ప్రకారము క్షేత్రీగృతపదంబును దొమ్మిదింట బెంచి యేడింట భాగహరింపగా మిగిలినది వారంబు అగును గదా. అట్టి వారంబులలో శుక్రసోమవారంబులు శుభంబులనుగలుగ జేయును. శనివారముచోరభయంబునుగలుగ జేయును. బుధ బృహస్పతి వారంబులు ధనప్రదంబులగును. సూర్యాంగారకవారంబులు దుఃఖమును గలుగ జేయును.

### వారంబులవలనకరణంబులను దెలియుటకుగణితసిద్ధము.

గీ. భానువాసరమాదిగాఁబలు నేడు। వాసరంబులపఠించవణజగరజి। పరగతైతులకౌలవబాలవములు। క్రమముతోబవభద్రవాకరణములును.

తా. ఆదిత్యవారంబునకువణిక్కరనము సోమవారంబునకుగరజికరనము భౌమవారంబునకు తైతులాకరనం బుధవారంబునకు కౌలవాకరనంబు గురువారంబునకు బాలవాకరనంబు శుక్రవారంబునకు బవకరనంబు శనివారంబునకు భద్రవ్వాకరనంబు ఈప్రకారంబు కరనంబులు గణితసిద్ధమయ్యెనని తెలియనగును.

### నక్షత్రఫలము.

సీ. రూపింపనశ్వనిరోహిణిమృగశీర్షలలపుష్యహస్తచిత్తానురాధ।
లాపూర్ణమైనుత్తరాషాఢవిష్ణుప ల్సరవిధనిష్టయుశతభిషంబు।
లనందగునతారలత్యుత్తమంబులుయుర్వినార్ద్రిపునర్వసూత్తరములు।
పరగజ్యేష్ఠోత్తరాభాద్రరేవతులవిధ్యమతారలుమఱియుభరణి.

గీ. వహ్నియాశ్లేషమకలుపూర్వత్రయంబు । వెలమిస్వాతివిశాకమూలలకును। పదియులదనుతారలునిత్యంబులనందగును। వాస్తుసిద్ధాంతమార్గము ల్వారిజాక్ష.

తా. అశ్వని, రోహిణి, మృగశీర్ష, పుష్యమి, హస్త, చిత్త, అనూరాధ, ఉత్తరాషాఢ, శ్రవణ, ధనిష్ట, శతభిషంబులు సుభకరంబులు. ఆర్ద్ర, పునర్వసు, ఉత్తర, జ్యేష్ట, ఉత్తరాభాద్ర, రేవతులు, మధ్యమఫల ప్రదంబులు. భరణి, కృత్తిక, ఆశ్లేష, మఖ, పుబ్బ, పూర్వాషాఢ, పూ

ర్వాభాద్ర, స్వాతి, విశాఖ, మూలలు అధమఫలం
ఏకాదశవర్గగణిత ప్రకరణమందు జెప్పబడిన ప్రకారంబు
బును ఎనిమిదింటచే [illegible]చి యిరువదేడింటను భాగహా
నక్షత్రమగునని చెప్పబడినదిగదా. కాబట్టి యిట్లు గణితాగత న
లోపలఉత్తమ మధ్యమాధమఫలంబులు గలుగజేయునక్షత్రంబులని
యవలయునుగాని గృహనిర్మాణ కాలీననక్షత్రంబులని యెంచగూడదు.
గృహనిర్మాణ నక్షత్రఫల మిదివరకే చెప్పబడినది.

అనుకూలముగాని యోగములు.

క. వజ్రపరిఘువ్యతీపాతవైధృతులునుగండశూలాతిగండవిష్కంభములును
అరయవ్యాఘాతమునశుభపదములం ద్రుంగడను యోగంబులెల్లనుకార్యసిద్ధి.

తా. తొల్లియేకాదశవర్గగణిత ప్రకరణమందె చెప్పబడినప్రకారంబు గణితాగత యోగంబులలో వజ్ర, పరిఘ, వ్యతీపాత, వైధృతిగండ, అతిగండ, శూల, విష్కంబ వ్యాఘాతంబులను యోగంబులు శుభకరంబులుగావు తక్కిన యోగంబులు శుభములని తా.

నక్షత్రమువలన యోగధనాంశలను దెలియుటకుగణితసిద్ధము.

గీ. అశ్వనిహర్షణవిధిప్రీతిఅదితిపాత। పైతృశోభనహస్తశివద్విదైవ। ధృతి
నిరుఋతిశుభవిష్ణువృద్ధిస్వజాంఘ్రి। ఐంద్రములువార్ధిలోకధనాంశలభ భా॥

సీ॥ భరణివిష్కంభంబుఆజ్జకుసిద్ధియుపుష్యసౌభాగ్యములుప్పుబ్బపరిఘ!
చిత్తసుకర్మంబుమైత్రకుసాధ్యంబుపూర్వాషాఢగండంబునసుప్రబ్రహ్మ
ఉత్తరాభాద్రకునెనరవ్యాఘాతంబుపీనికెన్నివైకుధనముయంశ।
అగ్నికివజ్రంబువార్ద్రియాయుష్మానుదగకువరీయానుత్తరాతిగండ

గీ. మనిలభమునకుసిద్ధమింద్రదక్షిణముకుశూల। నుత్తరాషాఢశుక్లంబును
దకపలియు। మృనముకేసతి యిభృతిసంయధనము పదియురెండంశ
తొమ్మిదిపంకజాక్ష.

తా. అశ్వనీనక్షత్రమునకుహర్షణనామయోగము. రోహిణికిప్రీతిపునర్వసుకువ్యతీపాత్, మఖకుశోభనము, హస్తను శివము, విశాఖకు ధృతియు మూలకు శుభము శ్రవణమునకు వృద్ధియు పూర్వాభాద్రకుఐంద్రనామయోగము గణితాగతమయిన [illegible] తొమ్మిది నక్షత్రములయొక్క యోగంబులకు నాలుగు ధనము, మ[illegible] శయునగును. భరణికి విష్కంభమును, మృగశీర్షకుసిద్ధియ [illegible] ము, పుబ్బ

శలనియెన్నబడును. పుత్రాంశ, గోధనాంశ, పుష్ప్యంశలుమూడును వక టిగనుక యిది పుష్ప్యంశయనబడును. కాబట్టి యీయంశలలో మూడవ యంశయు తొమ్మిదవయంశయు నుత్తమములు. ఆరవయంశ యధమఫల ప్రదమగునని తెలియనగును.

ఆ యు ష్య ఫ ల ము.

సీ. అరువదేండ్లకునాయువధికమైయున్నను కర్తనుభాగ్యసంకలితుజేయు। హీనమైననుపతికిహానిప్రదంబగు నింద్రుడుకామ్యార్థమిచ్చునెపుడు। పవనమిత్రుడుపహ్ని భయమునుసంపాదించు యముడుశుభంబుల నలర జేయు। రాక్షసేశ్వరుడుశాత్రవభయంబొనరించు వరుణదేవుడుపశు ప్రదమొనర్చు॥ గీ. చంచలంబొనరించుసరవిగంధ। వహుండుధన మునిచ్చునెపుడుధనకుడరయ। శివుడుకీడుమేలుసేయుగావున। నాయు వధిపతులఫలంబులవనికృష్ణా.

తా. ఆయుష్యము అరువదేండ్లకు నధికముగనుండెనేని కర్తకుభా గ్యంబుకలుగును. అరువదేండ్లకుదక్కువైయుండితే కర్తకుహానికలుగును దిక్పతులలో ఇంద్రుడు కర్తయయ్యెనేని శుభముగలుగును. అగ్నిదేవుడు అగ్నిభయంబును గలుగజేయును. యముడు శుభఫలంబును గలుగజేయు ను. నిరురుతివలన శత్రుభయంబుగలుగును. వరుణుడుపశువృద్ధినిజేయును

గదియర్ భాగ్యముమోదము స్మృతియుశోకంబున్దరిద్రత్వముర్।
మదినూహించిగృహంబు గట్టనగుసన్మాన్యుల్సులేశస్తుతా.

వాయువు చపలతను గలుగజేయును. కుబేరుడు ధనంబును నొసగును. శివునివలన కీడుమేలు రెండును గలుగుచుండును. ఇంతవరకు షోడశవర్గ గణిత ఫలమంతయు జెప్పబడినది.

భూతకులగ్నఫలము.

మ. పదముస్నాడిటబెంచియైదిట తగర్ భాగించితచ్ఛేషసం।
ఖ్యతగర్ భూజలపీతిహోత్రమరు దాకాశాఖ్యతత్వంబులర్।
గదియర్ భాగ్యముమోదము స్మృతియుశోకంబున్దరిద్రత్వముర్।
మదినూహించిగృహంబుగట్టనగు సన్మాన్యుల్సులేశస్తుతా.

తా. క్షేత్రీకృతపదమును మూడింటగుణించి యైదింటిచే భాగహ రింపగా ఒకటి మిగిలినయెడల భూతత్వము తెలియగనగును. దీని ఫలము భాగ్యముకలుగును. రెండుమిగిలినయెడల జలతత్వము దానిఫలము సంతో

షము. మూడు మిగిలెనేని యగ్నితత్వము దీనికి ఫలంబు మృత్యువు గలుగును. నాలుగు మిగిలెనేని వాయుతత్వము దీనికి ఫలము శోకభయము. అయిదు మిగిలినయెడల నాకాశతత్వము దీనికి ఫలము దారిద్ర్యము. ఇవ్విధంబుగ బంచభూతముల ఫలంబులను దెలిసి గృహములను గట్టనగును.

గీ. పదముతొమ్మిదింటబాగుగాగుణియించి । యదియునాలుగింటబా
లుగొన్న । శేషసంఖ్యకులము సిద్ధంబుజనులకు । కులముకులము
గూర్పవలయుగృష్ణా.

తా. క్షేత్రీకృతపదమును ౯-చే బంచి ౪-చే భాగహారింపగా మిగిలినసంఖ్య యొక్కటయ్యెనేని బ్రాహ్మణ కులమనియును, ౨ మిగిలితే క్షత్రియకులమనియును, ౩ మిగిలితే వైశ్యకులమనియును, ౪ మిగిలితే శూద్రకులమనియును దెలియవలయును. ఏకులమువారికాకులంబు నేకూర్చవలయును. యెక్కువ కులంబువారికి దక్కువకులంబుగల గృహంబు కూడునుగాని తక్కువకులంబువారి కెక్కువకులంబుగల గృహంబు శుభకరంబుగాదని యెరుగవలయును.

లగ్న నిర్ణయము.

క. పదసంఖ్యతొమ్మిదింటను । పదిలముగగుణించిరాశిపదిరెండింటన్ ।
వదలకదించిన శేషము । విదితంబుగలగ్న సంఖ్యవెలయునుగృష్ణా.

తా. క్షేత్రీకృతపదంబును ౯-చే బెంచి ౧౨-చే భాగహారింపగా ౧ మిగిలితే మేషము, ౨ మిగిలితే వృషభము, ౩ మిగిలితే మిథునము, ౪ మిగిలితే కర్కటము, ౫ మిగిలితే సింహము, ౬ మిగిలితే కన్య, ౭ మిగిలితే తుల, ౮ మిగిలితే వృశ్చికము, ౯ మిగిలితే ధనస్సు, ౧౦ మకరము, ౧౧ కుంభము, ౧౨ మిగిలితే మీనమని యెరుగవలయును.

గణితాగతనక్షత్రరాశినిర్ణయము.

మ. పదముల్నాలుగుగల్గుతారలవి జెప్పరాశినై జంబగున్ ।
పదమున్మూటజెలంగుతారకము లాజన్మాయరాశైతగున్ ।
పదముల్ రెండగుతారకాచయము లీనిన్ పూర్వరాశైదగున్ ।
పదమేకంబగుతార లేడు గణుతింపవారిశిబోన్నపన్నారీ.

తా. నాలుగుపాదంబులుగల నక్షత్రంబులకు ఆరాశి జెప్పుటభావసిద్ధము. మూడు పాదంబులుగల నక్షత్రంబు పిమ్మటి రాశి కన్వయించును. రెండుపాదంబుల గల నక్షత్రంబు పూర్వరాశితో నన్వయించును

రాశికూటములు.

మ. పతిరాశ్యాదిగృహంబురాశిగణుతింపన్ రెండుపండ్రెండు।
ప్రస్తుతిమూడున్ పదకొండునాల్గుపదియైదన్ దొమ్మిదిన్నద్వను।
స్థితముల్బ్రాష్యములౌవిపర్యయములధిన్మధ్యమంబుల్సుభా।
స్థితముల్మేషములైనరాసులుధరన్నిలేజపత్రేక్షణా.

తా. గృహయజమానుని రాశిమొదలుకొని గృహరాశివఱకును లెక్కపెట్టగాద్వద్వాదశములును, తృతీయేకాదశములును, చతుర్థదశమములును, పంచమనవములును, షష్టాష్టములును, శుభకరంబులుగావు. ద్వాదశ ద్వితీయములును, ఏకాదశత్రయంబులును, దశమచతుర్థములును, నవమపంచమంబులును, అష్టషట్కములును, మధ్యమఫలప్రదములు ఘటసింహంబులుతప్ప దక్కిన సమంబులు శుభఫలంబులను గలుగజేయుచుండును.

రాశ్యధీశ్వరక్రూరసౌమ్యవర్ణేశ్వరనిర్ణయము.

సీ. అరయసింహంబున కధిపతి సూర్యుండు కర్కాటకంబేలుకమలవైరి।
అజవృశ్చికంబులకవనిపుత్రుడుభర్తమిథునాంగిసలకుబుధుడువిభుడు।
అలరుధనుమీనములకర్తగురుడగువృషభతులలకునువిభుడుకవియు।
మకరకుంభములకు నాథుండుశనిమతి రవికుజశనికేతురాహులెలమి.
గీ. క్రూరలితరులుసౌమ్యులుగురుడుకవియు। బ్రాహ్మణులుసూర్యభౌము
లు। రాచకులముచంద్రసౌమ్యులువైశ్యులు। శనియుశూద్రజాతిపాలకుడనదగు వారిజాక్షి.

తా. సింహంబున కధిపతిసూర్యుడు, కర్కటంబునకుచంద్రుడు, మేషవృశ్చికములకంగారకుడును, మిథునకన్యలకు బుధుడును, ధనుమీనంబులకుగురుడును, వృషభతులకుశుక్రుడును, మకరకుంభములకుశనియును నధిపతులు. సూర్యశనికుజరాహుకేతువులు క్రూరగ్రహంబులు చంద్రబుధ గురు శుక్రులు బ్రాహ్మణకులపాలకులు. సూర్యాంగారకులు క్షత్రియ గ్రహంబులు. చంద్రబుధులు వైశ్యకులపాలకులు, శనిశూద్ర జాతి కధిపతియని యభిప్రాయము.

నవవర్గగణితము.

సీ. ఇంటిపైజేకొన్నయిలధీర్ఘబాహువులువెలువుహస్తములచేగలయబెంచి
నాగాన్నిధిగజనవదంతిజలనిధి పంచషట్కములనేర్పడగుణించి।

ఇనదంతి వారణదినశైలనక్షత్ర యోగాద్రినిధులచే భాగశేష। మగు ప్రత్యుల్దనరుణాయాదిదివసవారతారా యోగకరణాంశలాదివరుస.
గీ. నిదియనవవర్గవనిపట్క విదితమగుచు। గణితమర్మంబు దెలిసినఘనులుమ దిని। వట్టిఫలతారతమ్యము ల్వెదకవలయు। వాస్తుశాస్త్రమతంబిది వాసుదేవా.

తా. గృహమును గట్టుటకు నిశ్చయింపబడిన భూమియొక్క నిడు ప వెడలుపు హస్తములచే బెంచిన బదమని యెన్నబడును. అట్టిక్షేత్రీ కృతపదమును 8 దింట పెంచి 12-చే భాగహరింపగా మిగిలినది ధనమని యెన్నబడును. 3-చే గుణించి 8-చే బాలుగొన్నయెడల మిగిలిన సంఖ్య ఋణము. మరల 9 దింటబెంచి, 8-చేబాలుగొనగా మిగిలినసంఖ్య యా యమగును. క్షేత్రీకృతపదముచే 8-చెబెంచి 30-చేబాలుగొనగా మిగిలి న సంఖ్య తిథియనబడును. 9-చేగుణించి 7 డింటబాలుగొనగా మిగిలిన సంఖ్య వారమగును. 8 దింటగుణించి 27-చేబాలుగొనగా శేషించిన సం ఖ్య నక్షత్రమగును. 4-చేబెంచి 27-చే భాగహరింపగా మిగిలిన సంఖ్య యోగమగును. 5-చే గుణించి 7 డింట బాలుగొన మిగిలినది కరణము. (కరణముపదనొకండుకనుక పదునొకంట భాగహరింపగా మిగిలినది కర ణమని కొందఱి యభిప్రాయము.) 6-చే గుణించి 9-చేబాలుగొనగా మి గిలినదియంశయగును. ఇది నవగర్గగనిత విధాయకశాస్త్రమనివాస్తుశా స్త్రవేత్తలు పలుకుదురు.

## షడ్వర్గ లక్షణము.

సీ. నిడుపు వెడల్పులనియుతంబుగా బెంచి యీలెక్కచేపట్ప్రితులటుల నెం చి। నానాగ్నినందాష్టనవరసంబుల బెంచి యర్కాష్టవసుతారకాద్రివి ధుల। భాగింపగానిల్వబడిసియీశేషము ల్దనఋణాయంబులు తారక ములు। వారాంశములుగానవరుసతోనీరీతిగణితజ్ఞులైనట్టి ఘనులు తెలిసి.
గీ. ఇందుతారాబలంబులుపొందుపరచి। లగ్నంసంపత్తితోడనులలితముగను ఇండ్లుగట్టిన సుబంబుఫలించునెపుడు। పరగషడ్వర్గమిదియంద్రుపంకజాక్షు.

తా. నిడుపు వెడల్పుచేబెంచినట్లయితే యామొత్తము పదమనియె న్నబడును. ఇట్టిపదమును 8 దింటగుణించి 12-చే బాలుగొనగా మిగిలిన ది ధనమగును. 3 డింటబెంచి 8-చేభాగహరింపగా మిగిలినది రుణమగు ను. 9-చేగుణించి 7-చే బాలుగొనగా శేషించినది వారమగును. 9-చే భాగహరింపగా మిగిలినదియాయమగును. 5-చేగుణించి 27 డింట బాలు

గొనగా మిగిలినది నక్షత్రమగును. 6_చేగుణించి 9_చే భాగహరింపగా మిగిలినది యంశయునగును. ఈ ప్రకారము తారాబలచంద్రబలయుక్తముగా జూడవలయును. మఱియును లగ్నసంపత్తిగలిగియుండవలయును.

ఫలితార్థము.

గీ. వరచతుర్దశవర్గలక్షణము లేక। కొదవపడెనేనిదగబదకొండువర్గు। లవియుబొసగమినవవర్గులరయమేలు। తుదనుషడ్వర్గశుద్ధియు దొరకవలయు.

తా॥ చతుర్దశవర్గగణితమునందు శుద్ధి దొరికెనేని యుత్తమోత్తమము అట్లుచతుర్దశవర్గ గనితశుద్ధి దొరకనిపక్షమునందు యేకాదశవర్గశుద్ధియయినను దొరకవలయును. అదియును కుదరనియెడల షడ్వర్గశుద్ధియైన గలిగియుండవలయును. ఈ మూటిలో నేదియును సరిపడకపోయెనేనియాగృహము నానావిధములయిన నాశములకు కారణమగును.

వ. తదనంతరంబ అర్వణంబు వినరించెద నందు కర్తనక్షత్రనిర్ణయము.

తా॥ ఇకను అర్వణక్రమమును జెప్పుచున్నాడు. అందు ముందుగ కర్తయొక్క నక్షత్రమును నిర్ణయించి చెప్పెదను.

గీ. ఆయుధవ్యవహారభృత్యాలయముల। గ్రామమంత్రనృపాశ్రయకరణములకు। జన్మనక్షత్రమద్దిపజనదువసుధ। నామతారప్రశస్తంబునరుల కెల్ల.

తా॥ యుద్ధమును జేయుటకును, ఆయుధములనుంచుట కొఱకును, వ్యవహారమును జేయుటకొఱకును, భృత్యులు నివసించుటకొఱకును, గృహనిర్మాణంబులయందును, గ్రామార్వణంబును జూచుటకొఱకును, మంత్రోపదేశంబును బొందుటకొఱకును, రాజసేనకును, జన్మనక్షత్రంబును వదలి నామనక్షత్రానుసారంబుగ నర్వణంబును జూడవలయును.

స్థానబలమునుజూచునట్టి లక్షణము.

సీ. కర్తనక్షత్రంబు గ్రామనక్షత్రంబు నిలయనక్షత్రంబు కలియగూడి। గ్రహసంఖ్యచాల్గొన్నగలిగియొక్కటనిల్వ ధనలాభమొందించుదత్పతికిని। ధనహానిరెండున్న దప్పదుమూడున్న క్షేమంబునాల్గుసంగ్రామమంద్రము। అయిదయివసుఖమగునారున్న రిపుభయం బేడున్న నృపపూజనలమిగాంచు. గీ. నష్టంబుననాశనంబగుచునుండు। తొమ్మిదయిన నుధనధాన్యసంపద। పదవిననుచునీస్థానలక్షణంబెరుగవలయు। వాస్తువిధులమతంబది వారిజాక్ష.

తా. అశ్వని మొదలుకొని గృహయజమానుని నక్షత్రంబువఱకుగణన జేయగా నెంత సంఖ్యయగునో యా మొత్తమునొక్కచో నుంచవలయును. మరల నశ్విని మొదలుకొని గ్రామనక్షత్రంబువఱకును గణనజేసి యా మొత్తంబును గూడ నొకచో నుంచవలయును. యీవిధంబుగానే మొదలుకొని గృహనక్షత్రంబువఱకును గణన జేయవలయును. యిట్లు చేసియీమూడు మొత్తములను గలియగూడి 9-దిచే భాగహరింపవలయును. అట్లు చేయగా నొక్కటిమిగిలితే ధనలోభము 2 మిగిలితే ధనహాని 3 మిగిలితే నిషేధము గలుగును 4 మిగిలితే గలహము జరుగుచుండును 5 మిగిలితే సుఖము 6 మిగిలితే శత్రుభయము 7 మిగిలితే రాజువలన గౌరవమును బొందును 8 మిగిలితే నాశము సంభవించును 9 మిగిలితే ధాన్యవృద్ధియగును. ఈ విషయంబు జక్కగ నాలోచించి గృహంబులను గట్టవలయును.

తారాబలమును జూచెడు విధి.

సీ. గృహపతి తారాదిగృహ భాండముగ నెంచి తిథిసంఖ్య భాగింప నిల్చునది
యు॥ నక్షత్ర మొకటైన నాశంబునొందించు సమతార లెల్లను సౌఖ్య మొద
వు॥ కర్త తారయు గృహతారయు నొకటైన సరవి త్రో మృత్యువు సంభవించు
ఐదు మిగిలిన దుఃఖ మతిశయంబుగ నుండు నేడు మిగిలిన మృత్యుహానరగ
లు॥ తొమ్మిదిమిగిలిన మది లేని దుఃఖంబు సమతార లెల్లను సౌఖ్య మొదవు.
గీ. పతికి గృహములకిట్లు దంపతులరీతి । జెలగి తారాబలము వీక్షింపవలయు॥
నెవ్వరేనియు దెలియక గట్టరాదు । గావున నిదియ మర్యాద కృష్ణా.

తా. గృహయజమానునియొక్క నక్షత్రంబు మొదలుకొని గృహ నక్షత్రము వఱకును గణన జేయగా సంభవించిన సంఖ్యను 9-చే భాగహరింపవలయును. అట్లు భాగహరింపగా 1 మిగిలితే నాశము గలుగును, 3 ధనహాని 5 దుఃఖము, 7 మృత్యువు, 9 హానిప్రదము, సరిసంఖ్యలు శుభములను విశేషము గలుగ జేయుచుండును. కర్తయొక్క నక్షత్రమును గృహనక్షత్రంబును నొక్కటియయ్యెనేని యవశ్యముగ మృత్యువు సంభవించును దంపతులకు తారాబలమును జూచినవిధంబున గృహంబునకు గూడ జూడవలయును.

వేధకూటలక్షణము.

సీ. ప్రకటింపనశ్వని భరణి కృత్తిక రోహిణులను జ్యేష్ఠానురాధలు విశాఖ॥
వాయువు పుబ్బ త్రుపుల్వరు సతో మఖ పుబ్బ ఉత్తర హస్తలను ధ్రువముగ॥

పగలువృషోత్తరాభాద్రపూర్వాభాద్రవరుణతారలుమూలవారివిశ్వ!
గోవిందులకునర్పరువుపునర్వసుశివులువైరులుమృగత్రష్ట్రవసులు.

గీ. జగతినన్యోన్యగోత్రవైరముపురాణ । నృపతిమనుభానుసంజ్ఞలరిపులు
దెలియ । నగునుడ్రాదినాల్గుమకాదినాల్గు । రమణమూలాదినా
లుగుతారకలుకృష్ణా.

తా. అశ్వనికి 18-దవదియగు జ్యేష్ఠవేధ, భరణికి 16-వదియగు
ననూరాధవేధ, కృత్తికకు 14-వదియగు విశాఖవేధ, రోహిణికి 12-వది
యగుస్వాతివేధ, మఖకు 18-వదియగు రేవతివేధ, పుబ్బకు 16-వదియగు
నుత్తరాభాద్రవేధ, ఉత్తరకు 14-వదియగు పూర్వాభాద్రవేధ, హస్తకు
12-వదియగు శతభిషమువేధ,మూలకు 18-వదియగు నాశ్లేషవేధ, పూ
ర్వాషాడకు 16-వదియగునార్ద్రవేధ, ఉత్తరాషాడకు 14-వదియగుపున
ర్వసువేధ,శ్రవణమునకు 12-వదియగు నార్ద్రవేధ, మృగశీర్ష, చిత్త,
ధనిష్ఠలకు పరస్పర శత్రుత్వంబుగలదు. కాబట్టి యిట్లు వేధలును, పరస్పర
శత్రుత్వంబును గలిగిన నక్షత్రములను వదలవలయును.

## గ్రహమిత్రత్వ కూటము.

సీ. రవికాప్తులిందుధరాసుతాంగిరసుల్శత్రువుర్భార్గవశనులుదలప । శశి
సంఖ్యమీనబుధుల్శత్రులెవ్వరులేరు కుజునకురవిచంద్రుగురులుహితు
లు । పగబుధుడౌసౌమ్యబంధువుల్రవిశుక్రు లరినిశాధీశుండుగురుని
మిత్రు। లాదిత్యశశిభౌములహితులుబుధశవు ల్మాజికావ్యచుట్టముల్మం
దబుద్ధి॥ గీ. శత్రులినచంద్రులెన్నంగశనికిగూర్చు । వారుబుధశు
క్రులౌదురువైరులెల్ల । చంద్రరవిలోహితాంగుడుసరణికడమ। గ్రహ
ములెల్లనుసములునిక్కంబుకృష్ణా.

తా. సూర్యునకు చంద్ర, అంగారక, బృహస్పతులు, మువ్వురును
మిత్రులు. శుక్రశనిలిరువురును శత్రువులు. బుధుడు సముండు. చంద్రు
నకు సూర్యబుధులు మిత్రులు శత్రువులునెవ్వరునులేరు. (కావునసూర్య
బుధులుతప్ప దక్కినవారందఱునుసమానులు) బుధునకు సూర్యశుక్రులు
స్నేహితులు. చంద్రుడుశత్రువు. శన్యంగారకబృహస్పతులుసములు. బృహ
స్పతికి సూర్యాంగారకచంద్రులుమిత్రులు. బుధశుక్రులు శత్రువులు. శనిస
ముడు. శుక్రునకుబుధశనులుమిత్రులు. సూర్యచంద్రులుశత్రువులు. అంగా
రకబుధులుసములు. శనికిబుధశుక్రులుమిత్రులు. సూర్యచంద్రాంగారకులు

శత్రువులు. బృహస్పతికిసముడు. అంగారకునకు సూర్యచంద్రగురువుమిత్రులు. బుధుడుశత్రువు. శుక్రశనులుసములు. ఈపద్యార్థమునకు సమంబుగ కాలామృతంబునందు జెప్పబడినది. అదెట్లనిన 'సూర్యశ్చార్యరుజేందవశ్చ సుహృదశ్శత్రూసితార్కీవిధోపి సూర్యజ్ఞౌసుహృదౌన శత్రురవనీపుత్రస్య పుత్రాని తేఅర్కాత్యేందవఇందుజోఽహ్యహితకృతజ్ఞసార్కీశుక్రౌహితౌచంద్రోరిస్సుహృదోగురోఃకుజశశిబ్రధ్నాసితజ్ఞౌసిపూ । సౌమ్యార్కీసుహృదౌభృగోశ్శశిరవీశత్రూభృగుజ్ఞాహితౌ।మందస్యాతరవీందవశ్చరిపవోనుక్తాః క్రమాన్మధ్యమాః.' ఈశ్లోకములయర్థమును పయిపదార్థమును సమానమేగనుక మరలతాత్పర్యమును వ్రాయక విరమించితినని యెఱుఁగనగును.

## రాశ్యధీశ్వరఫలము.

శా. అన్యోన్యంబగుమైత్రిసౌఖ్యమమృతంబన్యోన్యశత్రుత్వమ।
న్యోన్యంబైనసమత్వముం దెవులు జేదుర్మించుశత్రుత్వమున్ ।
జన్యాంబాసమనాత్రవంబు సమస్థాపంబుసంధించునా ।
మాన్యంబౌనసుమైత్రినీగులు మది భావించినన్గుఱ్.

తా. సూర్యచంద్రులకును, సూర్యాంగారకులకును, సూర్యబృహస్పతులకును, గురుకుజులకును, శుక్రశనులకును, పరస్పరమిత్రత్వము, దీనికి ఫలమత్యంతశుభఫలము. సూర్యశుక్రులకును, శనిసూర్యులకును, పరస్పర శత్రుత్వము. దీనికిఫలంబుమృత్యుసంభవించుట. గురుశనులకును, శుక్రాంగారకులకును పరస్పరంబుసమత్వము. దీనికిఫలము రోగములుగలుగుట. చంద్రబుధులకు శత్రుమిత్రత్వము. ఇందుకు ఫలంబు కలహము. గురుశుక్రులకును, అంగారక బుధులకును, శనికుజులకును, శుక్రచంద్రులకును, శనిచంద్రులకును సమశత్రుత్వము. ఇందుకు ఫలంబు మనస్తాపము. బుధసూర్యులకును, గురుచంద్రులకును, కుజచంద్రులకును, శనిబుధునకును, సమమిత్రత్వము. దీనికి మధ్యమ ఫలమని యెఱుఁగవలయును.

## గణకూటము.

సీ. అశ్వనీమృగశీర్షహస్తపునర్వసు శ్రవణరేవత్యనురాధపుష్య । వా
యునక్షత్రముల్పడిదేవగణములు శతభిషాశ్లేషవిశాఖచిత్త । జ్యేష్ఠ
మూలమఖధనిష్టకృత్తికలివి రాక్షసగణములార్ద్రయునుభరణి । బ్రా
హ్మ్యోత్తరోత్తరాభాద్రోత్తరాషాఢపూర్వత్రయంబునుభువినిమనుజ.
గీ. గణములగుగాన వైరివర్గంబు దెలిసి। యాష్టగణములతో జెందినట్టి। తార

నిండ్లుగట్టినశుభములనిచ్చునెపుడు। తెలియకెవ్వరుగట్టినదెలియదభవ.

తా. అశ్వని, మృగశీర్ష, హస్త, పునర్వసు, శ్రవణము, రేవతి, అనూరాధ, పుష్యమి, స్వాతి, యీతొమ్మిదినక్షత్రంబులును దేవగణసంజ్ఞకలవి. శతభిషము, ఆశ్లేష, విశాఖ, చిత్త, జ్యేష్ట, మూల, మఖ, ధనిష్ట, కృత్తిక, యీతొమ్మిదినక్షత్రాబులును రాక్షస గణసంజ్ఞకలవి. ఆరుద్ర, భరణి, రోహిణి, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్రలు తొమ్మిదియును మానవగణసంజ్ఞకలవి. కాబట్టి యీగణకూటంబులను గుర్తెఱిగి గృహంబులగట్టవలయును. ఈపద్యార్థానుసారంబుగగాలామృతంబునందు గణకూటము చెప్పబడినది. అదెట్లనిన. 'శ్లో. మిత్రాదిత్యాద్యదితిందుపౌష్ణపవనశ్రోణార్కతారాస్సురా । మర్త్యాఖ్యాసవచోత్తరాత్రయహరబ్రహ్మత్రిపూర్వాంతకా ఇంద్రాగ్నీవసుమూలతిత్ర్యవరుణజ్యేష్టాగ్న్యహిత్వష్ట్రబాన్యేతాన్యాసుర సంజ్ఞికానిసవతద్వ్యష్యేగణానాంఫలమ్. తా. అశ్వని, పునర్వసు, పుష్య, హస్త, స్వాతి, మృగశిర, అనూరాధ, శ్రవణ, రేవతులు తొమ్మిదియును దేవగణంబులు. ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, ఆరుద్ర, రోహిణి, పూష, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, భరణులు తొమ్మిదియును మానవగణంబులు. విశాఖ, ధనిష్ట, మూల, మఖ, శతభిష, జ్యేష్ట, కృత్తిక, ఆశ్లేష, చిత్తలు తొమ్మిదియును రాక్షస గణములని తెలియవలయును.

గణకూటఫలము.

గీ. దేవరాక్షసులకుతీరనిదుఃఖంబు । మనుజదైవతములుమధ్యమములు।
దైత్యమానవులకుదప్పదుమృత్యువు।సమతగణములైనసౌఖ్యమభవా॥

తా. దేవరాక్షసగణంబులకు సర్వకాలంబులయందును కలహంబు జరుగుటయేగాక యధికమయినదుఃఖంబుగూడ గలుగును. మనుష్యదేవగణంబులు మధ్యమ ఫలప్రదములు. రాక్షస మానవగణంబులు మృత్యువును గల్పించును. సమగణంబులు సుఖప్రదములగును. అనగా గృహనక్షత్రము గృహపతినక్షత్రము ఒక్కగణములో యుండెనేని శ్రేష్టమయినఫలము జరుగుచుండును.

వర్ణకూటము.

గీ. వృశ్చికకుళీరమీనముల్విప్రజాతి । హరిధనుర్మేషములుక్షత్రిమాన్వయం । బుధనువృషభమృగాంగల్వాయిశ్యజాతి । సాదితుల కుంభయుగ్మములుశ్శూద్రజాతి.

తా. వృశ్చిక కర్కాటక మీనములు మూడును బ్రాహ్మణజాతి, ధను ర్మేష సింహములు మూడును క్షత్రియజాతి, వృష కన్యా మకరములు మూడును వయిశ్యజాతి, తులా మిథున కుంభములు మూడును శూద్రజాతియని తెలియవలయును.

వర్ణ కూట ఫలము.

గీ. అధికజాతివారికధమసంగతిమేలు । అధములకునుబోసంగదధికజాతి।
సమతవర్ణమయినసమ్మతంబగునాల్గు। కులములకునుదంపతులకుబోలి.

తా బ్రాహ్మణజాతికి బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రజాతులు 4నికి వచ్చును, క్షత్రియులకు క్షత్రియవైశ్యశూద్రజాతులు 3-ను దగియుండును, వైశ్యులకువైశ్యశూద్రజాతులు 2-నుకూడును, శూద్రులకుశూద్రజాతియేతగియుండును. అనగాతక్కువజాతియేతగియుండును. అనగాతక్కువజాతివారి కెక్కువజాతి యుచితముగాదనితాత్పర్యము. సమజాతి యధికఫలంబునిచ్చును. అనగాగృహరాశి విప్రజాతియయ్యెనేని యాగృహంబు విప్రజాతివారికేతగియుండును. ఇటులనేతక్కినజాతులకును దెలియవలయును.

యోని కూటము.

సీ. అశ్వినిశతతారలశ్వముల్స్వాతి హస్తలుమహిషంబులుసరవిశోడ।
నలరుపూర్వాభాద్రయాధనిష్టయుహరుల్భరణి రేవతులవికరులుదలప।
అభిజత్తుమఱియుత్తరాషాఢముంగిసల్ రోహిణిమృగశీర్షల్రూఢినహులు।సరనుతాశ్లేషపునర్వసుల్పిల్లులు మొగిమఖపుబ్బలుమూషికములు।
సరవిపూర్వాషాడశ్రవణంబులోతులుపుష్యకృత్తికజలంబులుధరిత్రి।
తనరవిశాఖచిత్తలుపెద్దపులు లుత్తరాభాద్రలుత్తరలొగిసురభులు।
మూలయునార్ద్రయులీలతోశునకముల్ జేష్టానురాధలుసెలగితేళ్ళు.

గీ. మొదలుజెప్పినరుక్షములెల్లబోతు। లవలజెప్పినవెల్లయునగునునెంట్లు।
హయముయెనుముహరియుస్తి। ముంగిసపాముబోతుమూషకంబు।
రోతమేపులియునాఖ్రశునకము। లేరివైరివర్గంబుకూడదుకమలనాభ.

తా. అశ్వినిశతభిషములు అశ్వములు, స్వాతిహస్తలు ఎనుములు, పూర్వాభాద్రధనిష్టలు సింహములు, భరణిరేవతులు యేనుగులు, ఉత్తరాషాడాభిజిత్తులు ముంగిసలు, రోహిణీమృగశీర్షలు పాములు, ఆశ్లేషపునర్వసులు పిల్లులు, మఖపుబ్బ ఎలుకలు, పూర్వాషాఢ శ్రవణంబులు కోతులు, పుష్యకృత్తికలు మేకలు, విశాఖచిత్తలు పులులు, ఉత్తరోత్త

రాభాద్రలు ఆస్రలు, మూలార్ద్రలు శునకములు, జ్యేష్టానురాధలు జింకలు, యీజంటలో మొదటిది పురుషజాతియనియును, రెండవది స్త్రీజాతియనియును దెలియవలయును. అశ్వమహిషములకు గజసింహములకును, ముంగిస పాములకును, మార్జాల మూషకముండును, వానరాజములకును, గోవ్యాఘ్రములకును, శ్వానహరిణములకును, పరస్పరవైరముగనుక, సమ్మతంబునుబొందగూడదని తాత్పర్యము. ఈపద్యార్థంబునకుసరియగుశ్లోకంబులు కాలామృతంబునందుజెప్పబడినవి. 'శ్లో. భానాయోనిరియంతుదస్రవరుణావశ్వాయమాంత్యోగజౌపుష్యాగ్నిసదజావహీంద్విధినిధూశ్వానౌతుమూలేశ్వరా। మార్జాలాపురగాదితిపిత్వభగా వాఖూపరాచార్యమా హిర్బుధ్న్యమతుదర్క భేతుమహిషానిరద్రాగ్నిచిత్రాఖ్యభే ర్వ్యాఘ్రౌశక్రభమయిత్రభేతుహరిణౌత్రో యాచ్యుతౌమర్కటౌ। సింహాఖ్యాసటపాద్వసహపరిణీపూర్వాశ్వాభిజద్యేక్రమాత్ । వయిరంబభుర్రీసృపంహరిగజం శాఖామృగాజంభజే । ర్దంపత్యోరపినయిరడుస్వమహిమం గోవ్యాఘ్రమోత్వానిచ॥' ఈ శ్లోకార్థమును పద్యార్థమును నొక్కటియే గనుక మరలవ్రాయక విరమించితిమి.

యోనికూటఫలయథర్ణము.

క. గ్రహమైత్రిమహీసురులకు । మహిమపతులకుగణముమైత్రిమతివైశ్యులకుర్ణ।విహితముగువర్ణమయిత్రియు । సహజముశూద్రులకుయోనిసంగముకృష్ణా.

తా. బ్రాహ్మణులకుగ్రహమైత్రియుండవలయును, క్షత్రియులకు గణకూటంబు చక్కగానుండవలయును, వైశ్యులకు వర్ణకూటంబు కుదిరియుండవలయును, శూద్రులకు యోనికూటంబు తగియుండవలయును.

మాసక్రమవాస్తుపురుషస్థితినిర్ణయము.

సీ. ఉర్విభాద్రపదాశ్వయుజకార్తికంబులనలవాస్తుప్రాగ్దిశతలగడౌను
మార్గశీర్షపుష్యమాఘమాసంబులుదక్షిణశిరసుడై తనరియుండు।
వరుసఫాల్గుణచైత్రవైశాఖములయందు బడమటితలగడై పవ్వళించు।
ఘనతరజ్యేష్టాషాఢశ్రావణంబులనుత్తరశిరసుడై యుండునెపుడు.

గీ. వామశాయియగువర్తించునిరతంబు । నతనిదృష్టిపదమునందునిండ్లు।
గట్టిరేనిమృత్యుఘనరోగములజెందు । శిరమునందువెనకసిరులుకృష్ణ.

తా. భాద్రపదాశ్వయుజకార్తికమాసము లమూటియందునువా

స్తుపురుషుడుతూర్పు భాగముగదలనుబెట్టుకొని పశ్చిమపుదిక్కునకు పాదములనుబెట్టుకొని యెడమప్రక్క భూమియందు దగులుకొనునట్లు పవ్వళించి దక్షిణపుదిక్కునుజూచుచుండును. మార్గశీర్ష పుష్యమాఘమాసములయందు దక్షిణముగ శిరస్సునుబెట్టుకొని యుత్తరమునకు పాదములనుంచుకొని పశ్చిమపుదిక్కును జూచుచుండును. ఫాల్గుణచైత్రవైశాఖమాసములయందు పడమటతలనుంచుకొని తూర్పునపాదములనుంచుకొనియుత్తర దిక్కును చూచుచుండును. జేష్ఠ ఆషాడ శ్రావణమాసములయందు ఉత్తరవైపున శిరస్సుబెట్టుకొని దక్షిణముగ బాదములనుబెట్టి తూర్పుదిక్కునుజూచుచుండును. ఈవాస్తుపురుషునిదృష్టియందును, పాదములయందును, తలవాకిండ్లను పెట్టవలయునుగాని గృహముల గట్టదగదు. దృష్టిగలప్రదేశమునందును పాదములుగల ప్రదేశమునందును గృములుగట్టిన యెడల మృత్యుభయమును రోగభయమును గలిగియుండును. శిరోభాగమునందును, పృష్టభాగమునందును గృహములు గట్టినటులయిన సంపద గలుగును. యీప్రకారము కాలామృతమను జ్యోతిశాస్త్రమునందును జెప్పబడినది. 'శ్లో. మాసేషుక్రమశస్త్రిషుత్రిషుసదాప్రాచసభస్యాదితస్వోపాదేయ మహీంషువాస్తుపురుష స్తద్వామశాయీభవేత్ । త్యక్త్వా తచ్చరణేక్షణస్థకకుభౌతత్పృష్టమూర్థస్థది । క్చాలాస్వేవవినిక్షిపేత్తదుదరేశంకుంయథోక్తంసుధీః'' ఈపద్యార్థమును పయినుదహరించిన తెనుగుపద్యముయొక్క యర్థమును సమముగ నుండుటచే మరల వ్రాయక విరచించితిమి.

### సంక్రాంతి వాస్తుపురుషనిర్ణయము.

సీ. కన్యయుతులవృశ్చికమునన్దుతూర్పుశిరమునై యావాస్తుపురుషుడుండు।
మరిధనుర్మకరకుంభములందు దక్షిణమాశ్రిమైనెమ్మదిమరివసించు।
మేటికాయామీనమేషవృషభంబులబడమటతలగడై పవ్వళించు। గణు
తింపమిథునకర్కటసింహములయందు నుత్తరశిరసుడైయుండునెపుడు.
గీ. యెడమప్రక్కక్రిందుపడగబర్యంకుడై। దృష్టిపదములందుదీటుకొల్పు।
నిట్టిలక్షణంబులెరిగి గృహంబులు । గట్టగార్యసిద్ధికమలనాభా.

తా॥ కన్యతులవృశ్చికసంక్రాంతులయందువాస్తుపురుషుడుతూర్పు భాగమున శిరమునిడుకొని పడమటిభాగమున పాదముల బెట్టుకొని ఎడమ పార్శ్వమున నేల మోపిపరుండి పడమటిదిక్కును జూచుచుండును. ధను

మక-శరకుంభ సంక్రాంతులయందు దక్షిణపుదిక్కున శిరసునుబెట్టుకొని యుత్తరపుదిక్కున బాదములుబెట్టుకొని యెడమప్రక్కను నేలమోపియు త్తరమునుజూచుచుపరుండు. మీనమేషవృషభసంక్రాంతులయందు పశ్చిమపుదిక్కున శిరస్సునుబెట్టుకొని తూర్పునకు పాదములు చాచుకొని తూర్పునుచూచిపరుండును. మిథునకర్కటసింహమాసములయందు త్తరముగ శిరమునుబెట్టుకొని దక్షిణముగ బాదములనుంచుకొని యెడమప్రక్కను బవ్వళించి దక్షిణమును జూచుచుబరుండును. వాస్తుపురుషుడు పాదముల నుజూచుచు పడుకొనునుగావున నతని పాదములుగల దిక్కున దలవరను బెట్టవలయునుగాని గృహములుగట్టదగదని యెరుగవలయును.

వాస్తుపురుషనాభిస్తాననిర్ణయము.

గీ. భవనమానంబుదొమ్మిదిపాళ్లు జేసి। నడిమిభాగంబుమూడుసేర్పడ
గఁజేసి। పాదయుగళంబునకు రెండుపాళ్లువిడువ। నిలుచుభాగం
బునాభికినియతికృష్ణా.

తా. వాస్తుపురుషుడు పవ్వళించిననిడివినిగొలిచి, (అనగా గృహముయొక్క మానమునుగొలిచి) దానిని 9-ది భాగములుచేసి మధ్యనుండు 3 భాగములతో 2 భాగములను వాస్తుపురుషునిపాదములుగలదిక్కునవదలి నిలిచినభాగమును వాస్తుపురుషునినాభిస్తానమని యెరుగనగును.

శంకుస్తాపన ఖాతఫలనిర్ణయము.

గీ. తలనుఘాతమైనదండ్రిమృతంబగు। బాదయుగళియందబత్నినొచ్చు। ము
ఖమువీపునందుమొగిరోగభయములు। కుక్షియందుసిరులుగూర్చుకృష్ణ.

తా. వాస్తుపురుషునిశిరస్సుమీదద్రవ్వినయెడల దండ్రికిహానిగలుగును, పాదములమీద ద్రవ్వినయెడల భార్యకుహానిగలుగును, ముఖమునందును వీపునందును ద్రవ్వినయెడల రోగభయములు గలుగును, కుక్షియందుద్రవ్వినయెడల సంపదలుగలుగును.

క. పంచాంగశుద్ధిదివసాఁదంచితగతిదనకుజంద్రతారాబలముఁల్।
గాంచిత్రిస్థవతినిబూ।జించివనంబునకుబనుపజేకురుకృష్ణా.

తా. తిథివారనక్షత్రయోగకరణములైనను మంచివియగుదినమును విచారించి తారాబలముచితముగ నుండునటుల యోచించవలయును. అట్టిశుభదినమందు వడ్రంగికి గంధాక్షతతాంబూలకట్నంబులిచ్చి గృహోపకరణములనుదెచ్చుటకు వనమునకుబంపుట శుభకరమనియెఱుగనగును.

గీ. బహుళపంచమి మొదలుగాబుగనైదు। దినములను ఖండితములైన ఘనకుజములు। బుష్పికొనవందురోహిణియుండెనేని। తుమ్మ్రవేల్మిడిబుచ్చవద్భుతముకృష్ణా.

తా. బహుళపంచమిమొదలుకొని యైదుదినములలోపల నరికినమ్రాకులు పుచ్చును. యైదుదినములో రోహిణి నక్షత్రములభించెనేని యత్యుత్తమము, అట్టికాలమునందు దుమ్మచెట్లుగూడ పుచ్చవని తెలియవలయును.

గీ. బనరఁగృత్తికయంగర్కుచుండెనేని। శ్రవణనక్షత్రమునకుంభరాశి। శుక్రుడుండెనేని రుచ్ఛేదమొప్పదంద్రు । ముున్నునరికినవైననుపాసగవధిపా.

తా. కృత్తికానక్షత్రమునందు సూర్యుడుండుసమయముునను, ధనిష్టనక్షత్రతృతీయచతుర్థ చరణములయందును. శతభిషానక్షత్రమునందును, పూర్వాభాద్రయొక్క 3 పాదంబులయందును, శుక్రుండు సంచరించు కాలమునందును వృక్షములను ఛేదింపగూడదు. పూర్వము నరికినమ్రాకులనుగూడ నిట్టికాలమునందుదేగూడదనుట. సనత్కుమారవాస్తువిధానమునందు వృక్షచ్ఛేదకాలము చెప్పబడినది. అదెట్లనిన. 'శ్లో. సుదినేవారనక్షత్రేసుయోగేకరణాన్వితే।చంద్రతారానుకూలేచ సులగ్నే శుక్లపక్షకే॥ తక్షకంభృత్యవర్గంచపూజాంకృత్వావిధానతః। ప్రాఙ్ముకోదఙ్ముకోవాపిఛింద్యాద్వృక్షస్యశోభనం॥' అనగా బంచాంగశుద్ధిగలదినమునందు తారాబలచంద్రబలమును చక్కగ నాలోచించుకొని వడ్రంగికిని భృత్యులకును సుముహూర్తమునందు బూజలుసల్పి యోగ్యమైనముహూర్తమునందు వృక్షచ్ఛేదమును జేయింపవలయును.

గీ. శ్రవణపంచకిమఖ పంచకములయందు । సలముఖాదిభనైదుతారలనుగూడి। నలినరిపుడున్నవృక్షముల్నరకరాదు । మున్నునరికివైదేబొసగదభవా.

తా. శ్రవణ, ధనిష్ట, శతభిష, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, మఖ, పుబ్బ, ఉత్తర, హస్త, చిత్ర, యీ 10 నక్షత్రములయందును జంద్రుడు సంచరించుచుండ వృక్షములనునరకరాదు. ఇంతియగాక యదివఱకు నరికిన వృక్షములనుగూడ దేగూడదనుట. ఈ యర్థమును సనత్కుమారవాస్తువిధానమునందును జెప్పబడినది. 'శ్లో. శ్రోణామఖాపంచకగేచంద్రే

వృక్షస్యాలబిదేవచనలాభంభవతిత్యేవముక భిఃపరికీర్తితాః.

నక్షత్రవృక్షములు.

సీ. అశ్వినిమొదలుగానటునక్షత్రమికశతి తారలవృక్షములొన్నరముష్టి యు
శిరిక మేడి పెంపొందంగ నేరేడుచంద్రవనచంద్ర వెదరు మొదయరావి నా
గ కేసరము చెన్న గుమఱిమోదుగ జువ్వియంబాళంబు సొంపు కోడ వెల
య మారేడుమద్దిములు వేముపొగడయునీరుమద్దియు వేగ నెమ్మి పనస.
గీ. జిల్లేడునుజమ్మికానుగు చెల్వమైన మామిడియు వేమునిప్పయుమన
దలంచు నరులుదరుతారకుజములునరకరాదు సలలితంబుగ బూ
జింపవలయుకృష్ణా.

తా. అశ్వనికి ముష్టిచెట్టు, భరణికి నుసిరికె, కృత్తికకు అత్తి, రో
హిణికి నేరేడు, మృగశీర్షకు చంద్ర, ఆర్ద్రకువనచంద్ర, పునర్వసుకు వె
... పుష్యమికిరావి, ఆశ్లేషకునాగకేసరము,మఖకుమఱ్ఱి, పుబ్బకుమో
... జువ్వి, హస్తకు అంబాళము, చిత్తకుమారేడు, స్వాతికిమ
... వేము, అనూరాధకుపొగడ, జ్యేష్ఠకు నీరుమద్ది, మూ
లకు వేగి, పూర్వాషాడకు నెమ్మి, ఉత్తరాషాడకు పనస, శ్రవణమునకు
జిల్లేడు, ధనిష్ఠకుజమ్మి, శతభిషమునకు కానుగు, పూర్వాభాద్రకుమామి
డి, ఉత్తరాభాద్రకు వేప, రేవతికి ఇప్ప, కాబట్టి ప్రతిమనుజుడు తనదు
నక్షత్రముయొక్క వృక్షమును నరకరాదు. అట్లుగాక నరికెనేని తమకుతా
మే హానిజేసుకొన్న చందమగును గనుక పూజింపవలయును.

క. శత్రుపునక్షత్రంబులు శత్రు పుశత్రుయోనివృక్షములధరణ
శత్రుగృహపతికిసరిన క్షత్రంబులును దెలిసి సేయగవలయున్.

తా. అశ్వనికి నీరుమద్ది, భరణికి పొగడ, కృత్తికకు ములువేము,
రోహిణికిమద్ది, మఖకు ఇప్ప, పుబ్బకు వేప, ఉత్తరకు మామిడి, హస్తకు
కానుగు, మూలకు నాగకేసరము, పూర్వాషాఢకు రావి, ఉత్తరాషాడ
కు వెదురు, శ్రవణమునకు వనచంద్ర, మృగశీర్షకుమారేడు, జమ్మిచి
త్తకుచంద్ర, యీ నక్షత్రంబులకు నీవృక్షంబులు శత్రువృక్షంబులు. కా
బట్టిపరిహరింపవలయును.ఇకను శత్రుయోనివృక్షంబులనుజెప్పెదను. స్వా
తిహస్తలకుముష్టికానుగులు, భరణిరేవతులకు మామిడిజంతులు,రోహిణి
మృగశీర్షలకు పనస, మఖపుబ్బలకు నాగకేసరము, వెదురును, పుష్య
మికృత్తికలకు నెమ్మిజిల్లేడులు,ఉత్తరఉత్తరాభాద్రలకు వేము,మారేడులు,

జ్యేష్టఅనురాధలకు వేగివనచంద్రలు, ఈనక్షత్రంబులకీవృక్షంబులుశత్రు యోనివి. యింతియగాక సగముకాలినవృక్షంబులతో నిండ్లగట్టరాదు.

మఱియును,

ఉ. తేనెలుబెట్టుభ్రమాకులును దేవరభ్రమాకులురచ్చభ్రమాకులున్
మానులు నిల్చుభ్రమాకులోర భ్రమాకులుమూలికెలున్నభ్రమాకులున్
నేనుగుగట్టుభ్రమాకులును నెక్కుతీగెలుజుట్టుభ్రమాకులున్
మానుగపీర్లమాకులును మంచివికాదు గృహంబుగట్టగన్.

తా. తేనెతుట్టెలుపుట్టినభ్రమాకులును, దేవతలనిలిపినభ్రమాకులును జనులు సభలుసేయుచున్నభ్రమాకులును, మునులునివసించుభ్రమాకులును పరస్పరంబుగ నొరసిపికిని పొందియున్నభ్రమాకులును, మూలికెలతో పెన వేసుకొనియున్న భ్రమాకులును, యేనుగులను కట్టినభ్రమాకులును, పీరుల-ను నిలిపినభ్రమాకులును, గృహములకు పనికిరావు.

సీ. తాండ్రగుంపెనచిల్ల తపసిబూరుగువేగి జీడివావిలిముష్టి
అగిశ యేరండంబు ఆరెపచ్చారియె రేలపొలికిప
మఱ్ఱిమోదుగుజువ్విమామిడిజెముడిప్ప చెన్నంగియుసిరికె చింతవెలగ।
ఊడుగసోమిందయుప్పితంగేడు నెరుసుద్దిరావి పెద్దమాను వేము.

గీ. అన్యకంటకంబులారయశల్యంబు। లెలమినుూలములనుగలయవడిను।
కదిర మొకటిదక్కగంటకద్రుమములు।నిందితములులుస్త్రనియత్రికృష్ణ.

తా. తాండ్ర, గుంపెన, చిల్ల, తపసి, బూరుగు, వేగి, జీడి, వావిలి, ముష్టి, అత్తి, తాడి, అగిశ, ఆముదపుచెట్టు, ఆరె, పచ్చారె, రేప పొలికి, పల్లరేను, చిగిరె, మఱ్ఱి, మోదుగ, జువ్వి, మామిడి, జెముడు, యిప్ప, చెన్నంగి, ఉసిరికె, చింత, తెలగ, వూడుగ, సోమింద, వుప్పి, తంగేడు, మెరుమద్ది, రావి, పెద్దమాను, వేప, వరులకండించినవి. వరులగృహంబులదావువులు. దోవగానున్నది. చంద్రచెట్టుతప్ప తక్కినకంటక ప్రదానవృక్షంబులుగృహంబులకు పనికిరావు.

గీ. మానుకాటుపెట్టిమంజిష్టకలరవ । తైలగుడపిశంగనీలకపిల।
కాంతులున్నగప్పగాళితేలును।రాయియుడుముపాముచిల్వదగనుకృష్ణ.

తా. మానుకాటుపెట్టి చూచునప్పుడు మంజిష్టవర్ణంబు వుండినయెడలకప్పయుండును, పావురపువర్ణముగలిగియుండెనేని గాళినివసించియుండును, నూనెరంగుకలిగియుండెనేని తేలుండును. బెల్లపువర్ణంబు

## గృహకర్ణికాచక్రము.

సీ. లింగత్రయాకృతిలిఖియించియుయడ్డ రేఖలునాల్గునందిశిక్రమము
తోడ। అశ్వనాదివదారలన్నియుండగవ్రాసి యుడురాజయేరేఖ
నుండునందు। ఆదిత్యుడుండిననగ్నిభయంబగు మేదినీసుతుడున్న
మృత్యుభయము। బుధుడున్నరోగముల్పుట్టించుగురుడున్న భాగ్య
హీనము జేయభార్గవుండు.

గీ. కలహమొనరించుశనియుదస్కరభయంబు। రాహువున్ననుపతికి
దేహాదిపీడ। చలనముగ జేయు కేతువసంతసంబు। వెలగృహక
ర్ణికాచక్రఫలములభవా.

తా. మూడులింగరేఖలుగీసి దానికి నాలుగు అడ్డరేఖలను వ్రాసి అశ్వనిమొదలుకొని 27 నక్షత్రములు లింగమున 9 లెక్కలనువ్రాసియే యడ్డరేఖయందుండునట్టి నక్షత్రమునందు చంద్రుడు సంచరించునో యా రేఖయందలి నక్షత్రములయందు సూర్యుండుండెనేని యగ్నిభయముగలుగును. అంగారకుడుండెనేని మృత్యుభయము గలుగును. బుధుడుండెనేని రోగపద్రవముగలుగును. బృహస్పతియుండెనేని భాగ్యహానియగును. శుక్రుడుండెనేని కలహముజరుగును. శనియుండెనేని చోరభయము గలుగును. రాహువుండెనేని గృహయజమానునికిదేహపీడగలుగచేయును. కేతువుండెనేని చలనముసంభవించును. ఈ గృహకర్ణికాచక్రమునందుసంచరించునక్షత్రములలో నూర్ధ్వముఖ నక్షత్రములు స్తంభప్రతిష్టకు నుచితములయినవి. దిగువచ్చు నక్షత్రములలో నధోముఖనక్షత్రములు నిందితములు. రోహిణి, పుష్యమి, ఆర్ద్ర, శ్రవణము, ధనిష్ట, శతభిషము, ఉత్తర, ఉత్తరాషాడ, ఉత్తరాభాద్ర, ఈ 9 నక్షత్రములయందును స్తంభప్రతిష్టయును, ధ్వజములు నిలుపుటయును, వనములు వేయుటయును, మేడలుగట్టుటయును నుచితములయియుండును. రేవతి, పునర్వసు, హస్త, చిత్త, స్వాతి, అశ్విని, మృగశీర్ష, అనూరాధ, జ్యేష్టలు 9 యును, తిర్యఙ్ముఖనక్షత్రములు ఈ 9 నక్షత్రములును గోడలుపెట్టుటకును గజాశ్వోష్ట్రములు గొనుటకును తగినవనిదెలియువలయును. మఖ, విశాఖ, మూల, ఆశ్రేష, కృత్తిక, పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, భరణులు 9 యును నధోముఖ నక్షత్రములు. ఈ 9 నక్షత్రములును బావులు, కాలువలు, అగడ్తలు, గుహ్వలు మొదలగునవి త్రవ్వుటకునుచితములు. మఱి

యును ధన నిక్షేపమును జేయుటకును, జూదమాడుటకును తగియుండును. ఈ గృహకర్ణికాచక్రలక్షణము కాలామృతమునందును జెప్పబడినది. అదెట్లనిన, శ్లో. చక్రంస్యాద్గృహకర్ణికాహ్వయ మిదంసంలిఖ్యాలింగత్రయం। రేఖాన్తతచతస్రయేనసలిఖేత్తిర్యక్ఛదస్రాదితః । గేకయికస్యహింతారకాననవప్రాల్లింగవామాధరా। దూర్ధ్వస్థా అపిజోర్ధ్వగాశ్శుభఫలానింద్యాస్త్వథో దేశగాః. తా. నిసుపుగ మూడులింగాకారరేఖలు వ్రాసి వానిపయి నాలుగడ్డగీట్లగీచి యందునెడమప్రక్కనున్న లింగమునకెడమపార్శ్వమునమన్న క్రిందియడ్డగీట్లు మొదలొక్కొక్కగీతకు నశ్విని మొదలుకొని యొక్కొక్కనక్షత్రమువరుసను వ్రాయవలయును. అనగా లింగమునకు నెడమప్రక్క నక్షత్రములుశిరస్సున1నక్షత్రము కుడిప్రక్క 4 నక్షత్రములీరీతిన ప్రతిలింగమునకును వ్రాయగా అన్నిలింగముల శిరస్సుననున్న నక్షత్రములు యెడమ ప్రక్కనున్న 4 నక్షత్రంబులు స్తంభప్రతిష్ట మొదలగు కార్యములవిషయమయిశుభకరములగును.లింగమునకు కుడిప్రక్కనున్న నక్షత్రముల శుభకరములగుననుట. అశ్విన్యాది నక్షత్రములలోని చక్రమందు శ్రేష్టములుగా నేర్పెడెడు నక్షత్రములను దెలిసికొనుటకు నాయానక్షత్ర జ్ఞాపకములగు సంఖ్యలు వ్రాయబడియున్నది. 1 2 3 4 5 10 11 12 13 14 19 20 21 22 23 ఈసంఖ్యలుగల నక్షత్రములు శుభకరములనితా. సనత్కుమారవాస్తు నిధానశాస్త్రమునందు గృహకర్ణికాచక్రమునకు ఫలమివ్విధమున జప్పబడినది.' శ్లో. పూర్వ్వగంశుభదంప్రోక్తం మధోముఖంతునిందితం। గృహేతుచంద్రరేఖాయాం సుస్థితే గృహకర్ణికా. అనగా నూర్ధ్వనక్షత్రములు శుభకరములు అధోనక్షత్రము లశుభకరములని తెలియనగును.

## ఘటికా నిర్ణయము.

సీ. తునసీడపదములదగగొల్చిగిరిసంఖ్య నకదురోగాడిమేషాదిగాగ।
గన్యపర్వతంబుగరిమనొక్కటిదించి క్రమముతోగడమసంక్రమణము
లకు। బురవార్కశరబాణరథవైశ్వానరసంఖ్యలుదించి శేషంబునిలిపి।
మొగిపహఃపరిమాణమునసగంబ్రదిసంఖ్యను బెంచిముల్నించినట్టరాసి.
గీ. చేతభాగించగడియలీరీతివచ్చు। బరగు మధ్యాహ్నమున
కుబూర్వంబుగతము। పొద్దుదిరిగిన శేషమునకుదనరు।
గడియలీరీతిగననగుగమలనాభా.

తా. మనుష్యుడు చక్కగా నిలవబడి తననీడ యెంతపొడవు గలిగి యుండునో యానీడను తనపాదములచే గొలిచి యాసంఖ్యలో 7-డింటిని కలియగూడి మేషసంక్రాంతిమొదలు కన్యాసంక్రాంతివఱకును 1 వంతు నత్రోసివేసేది. తులాసంక్రాంతికి వృశ్చికమునకు 4 ధనస్సునకు 5 మకరమునకు 5 కుంభమునకు 4 మీనమునకు 3 ఈ క్రమమున ప్రతిసంక్రాంతికిని ఈ సంఖ్యలుత్రోసివేసి మిగిలినసంఖ్యను వుంచుకొనియహః ప్రమాణమెంతయుండునో దానిని సగముచేయువలయును అంతటనాసంఖ్యను యేడింటగుణించి మునుపుకడగానున్న సంఖ్యచేతభాగించితే వచ్చినలబ్ధముగడియలని తెలియవలయును. మిగిలినసంఖ్యను 60-చే గుణించి మునుపుగడియలను భాగించిన సంఖ్యచేత భాగించగానచ్చిన లబ్ధమువిగడియలగును. ఉదయకాలమునం దిన్ని గడియలయినవనియును, సాయంకాలమునం దిన్ని గడియలు కావలసియున్నవనియు దెలియవలయును.

లగ్ననిర్ణయము.

గీ. నాల్గుగడియలుమేషమీనములువాల్గు। వరయువృషకుంభలగ్నములయిదుపాతి। కేయునుమృగయుగ్మతులకన్యలైదునరయు। వాగ్ధనుఃకర్కివృశ్చికమునుదినంబు.

తా. మేషము 4 గడియలు,వృషభము 4-గున్నరగడియ, మిథునము 5 పాతికె, కర్కాటకము 5-దున్నర, సింహము 5-దున్నర కన్య 5 పాతికె, వృశ్చికము 5-గున్నర, మకరము 5 పాతికె, కుంభము 4-న్నర, మీనము 4 ఈ ప్రకారము లగ్నములయొక్క గడియవిగడియలను దెలియవలయును. కాలామృతమునందును నీప్రకారముగానే చెప్పబడెను. అదెట్లనిన. 'శ్లో. మే షేమీనగృహేచతస్రఘటికా స్సార్ధంచతస్రోవృషే।కుంభేపాదయుతాశ్చపంచమకరంస్త్రీయుగ్మతాలీషుచ। సార్ధంపంచకుళీరకేసరిధనుఃకీటేసుచేన్నాడికా। లగ్నానాంఘటికాప్రమాణగణనాగ్నేయాక్రమాద్భాస్కరయిః. పయిపద్యార్థము యీశ్లోకార్థముసమానముగనుక మరలవ్రాయలేదు.

చరస్థిరద్విస్వభావలగ్నములు.

గీ. మేషకర్కితౌళిమృగములుచరములు। గోవసింహకీటకుంభములును। స్థిరములసగబరగుద్విస్వభావంబులు। మిథునమిరితివిల్లుమీనులభవా.

తా. మేష కర్కాట తులా మకరములు నాలుగును చరములు, వృషభ సింహ వృశ్చిక కుంభములు స్థిరములు, మిథున కన్యా ధనుర్మీనము లు ద్విస్వభావములని తెలియనగును.

గ్రహముల కుచ్చ పరమోచ్చ నీచ మూలత్రికోణము.

సీ. భాస్కరుఁడాదిగాఁ బరగు సప్తగ్రహంబు లకజవృష మకరంబులంగనయు ను। కర్కాటఝషతులల్గ్రమము మొప్పనుచ్చలు పరువడినింపలోఁ బదియు మూఁడు। నిర్వదెనిమిదిపదిహేను నైదిర్వదేనిర్వదిభాగాలు నుర్విదెలియ। బరమోచ్చసంజ్ఞలబరగుదదుచ్చల కేసగు సప్తమరాసు లెంచ నీచ.

గీ. లగును సింహంబు వృషభంబు నజము కన్య। విల్లుతులయును కలశంబు వినుతగము। దనరు మూలత్రికోణాభిధానములను। సకలసిద్ధాంతశాస్త్రార్థ సరణి కృష్ణా.

తా. సూర్యునకునుచ్చస్థానము మేషము, అందు భాగములు బరమోచ్చ మేషమునకు సప్తమస్థానమయిన తులాలగ్నము నీచస్థానము, మూలత్రికోణము సింహము, చంద్రునకు వృషభము ఉచ్చస్థానము, అందు మూఁడు భాగములు పరమోచ్చస్థానము, ఈ వృషభలగ్నమునకు సప్తమలగ్నమైన వృశ్చికలగ్నము నీచస్థానము, కర్కాటకము మూలత్రికోణము, అంగారకునకు మకరముచ్చస్థానము, ఈ మకరములో 28 భాగములు పరమోచ్చము, ఈ మకరమునకు సప్తమస్థానమైన కర్కాటము నీచస్థానము, మూలత్రికోణము మేషము బుధునకుచ్చస్థానము కన్య, ఈ కన్యయందు 15 భాగములు పరమోచ్చము, ఈ రాశికి 7-వదియగు మీనము నీచస్థానము, మూలత్రికోణము కన్య మిథునము గురునకు నుచ్చస్థానము, కర్కాటము యీ కర్కాటమునందు 5 భాగములు పరమోచ్చము, యీ రాశికి సప్తమమైన మకరము నీచస్థానము, మూలత్రికోణము ధనుస్సు శుక్రునకునుచ్చస్థానము, మీనము ఈ మీనములో 27 భాగములు పరమోచ్చస్థానము, యీ మీనమున 7-వది అయిన కన్య నీచస్థానము, శనికి తులాలగ్నముచ్చస్థానము, ఈ తులాలగ్నమునందు 20 భాగములు పరమోచ్చము, యీ యుచ్చరాశి కేడవదియైన మేషము నీచస్థానము, మూలత్రికోణము కుంభము సూర్యునకు స్వక్షేత్ర మూలత్రికోణములు 2-ను నొక్కడే గనుక త్రింశద్భాగాత్మకతిలగ్నం, అనున్యాయానుసారముగ లగ్నమును ముప్పది భాగములు సేయవలయును. సింహముయొక్క ముప్పదికి తగు భాగములతో మొ

దటి భాగములు 20 మూలత్రికోణ భాగములు, మిగిలిన 10 భాగములును స్వక్షేత్రభాగములు, చంద్రునకు, నుచ్చమూలత్రికోణములను 2-ను వృషభలగ్నమేగనుక వృషభములో మొదటి 3 భాగములు స్వోచ్చభాగములు, మిగిలిన 27 భాగములును మూలత్రికోణభాగములు, అంగారకునకు మూలత్రికోణ స్వక్షేత్రములు 2-ను మేషమయ్యెను. కావున మేషలగ్నమునందు తొలుదటి 12 భాగములు మిగిలిన 18 భాగములును స్వక్షేత్రభాగములు, బుధునకు స్వోచ్చస్వక్షేత్ర మూలత్రికోణములు 3-ను కన్యాలగ్నమయ్యెను. కావున తొలుదటి 15 భాగములుచ్చ భాగములు, మధ్యభాగములు 10 మూల త్రికోణభాగములు మిగిలిన 5 భాగములు స్వక్షేత్రము, బృహస్పతికి మూలత్రికోణస్వక్షేత్రములు 2-ను ధనుస్సు, కావున మొదటి 10 భాగములు మూలత్రికోణము మిగిలిన 20 భాగములును స్వక్షేత్రము, శుక్రునకు మూలత్రికోణస్వక్షేత్రములు 2-ను తులాలగ్నము, కాబట్టి యాతులాలగ్నములో మొదటి 15 భాగములు స్వక్షేత్రభాగములు, శనికి మూలత్రికోణ స్వక్షేత్రములు 2-ను కుంభము, అందు మొదటి 20 భాగములును మూలత్రికోణ భాగములు, మిగిలిన 10 భాగములును స్వక్షేత్రము. యీ విషయము ముహూర్తదర్పణము మొదలగు గ్రంథములయందు జక్కగా వివరింపబడినది.

### కేంద్ర త్రికోణ నిర్ణయము.

గీ. పదియునేడునాల్గు పద్మపదలగ్నంబు । కేంద్రసంజ్ఞలయ్యె కలుషు
గను । తెలియదొమ్మిదైదు చెలగి త్రికోణ । లనగ వలయుధర
ణి నబ్జనాభా.

తా. లగ్నమునకు 4 7 10 స్థానములును లగ్నమును కేంద్రసంజ్ఞ కలవి. 5 9 స్థానములు త్రికోణసంజ్ఞకలవియని తాత్పర్యము. గ్రంథాంతరమునందును నిదేప్రకారము చెప్పబడినది. అదెట్లనిన,

శ్లో. లగ్నంచతుర్థదశమం సప్తమంకే ... కేంద్రములు
వపంచమే॥ అనగా లగ్న...
ములు త్రికోణములు.

... యము.

గ్రహ ... ర్ధదృష్టి

గీ. పదిటమూ...

తా. శుక్రుడు తూర్పునవుదయమయ్యేనేని 3 దినములు బాల్యము, పశ్చిమమున నుదయమయ్యేనేని ౧౦ దినములు బాల్యము, తూర్పున నస్తమానమయ్యేనేని యస్తమయంబునకు ముందుగ ౧౫ దినంబు మొదలుకొని వృద్ధుడగును, పశ్చిమపు దిక్కున నస్తమయంబునకు ముందు పమనయిమదినంబులు వృద్ధత్వము. ఇట్టి బాల్యవృద్ధతాస్తమయంబులకు స్తంభప్రతిష్టను చేయగూడదు.

లగ్న నిర్ణయము.

గీ॥ క్రూరులారింటమూడు మరిజేరి యున్న । శుభులు మూచినమండిన సూర్యభౌము । లగ్నయంశంబు నెనలించి రవిచరములు । వదలస్థిరములు ద్విస్వభావములు మేలు ॥

తా. క్రూరగ్రహములు లగ్నంబునకు 3 టను, ౬ టను నుండినను, శుభగ్రహంబులు లగ్నంబునుమాచుచుండినను, లగ్నంబునందు శుభులున్నను, సూర్యాంగారకాంశలు యువిపరిహరింపవలెను. స్థిరాంశంబునందు స్తంభప్రతిష్టను జేయవలెను. లగ్నమునకు గ్రహసంపత్తి యెంతియుండినను సూర్యాంగారకాంశలను పరిహరింపవలయును.

సీ॥ పాపగ్రహంబులుపదునొకండనునారిటనుమాటనుండిననమశుభము । అవిరెంట కేంద్రంబులందుద్రికోణంబు లందునుండిన జెందు గీడు । తెలియంగ సౌమ్యులు ద్విత్రికేంద్రంబుల ధనభావపముల భద్రమగును। అష్టమవ్యయములనవరజేగ్రహముస్నశుభులులగ్నము లెచ్చజూడ మేలు॥ గీ॥ మఱియు స్వోచ్చలందు మైత్రిరాసులయందు । పారనిసాల్వరములు సూర్యాది । గ్రహములెల్ల శుభము కల్పించుకర్తలు । నుచితమైనచోటు నొస్సుకృష్టా ॥

తా. పాపగ్రహంబులులగ్నంబునకు 3, ౬, ౧౧గృహంబులయందుండిన మేలుగలుగును. పాపగ్రహంబులు ౨టను, ౪ టను, ౭ టను, ౯ టను, ౫ టను నివసించియుండెనేని కీడుగలుగును. శుభగ్రహంబులు లగ్నంబునను ౨టను, 3టను, ౪టను, ౧౦టను, ౯టను, ౫టను నుండినేని శుభంబుగలుగును. ౭టను, ౧౨టను శుభపాపగ్రహంబు లెవ్వియునునుండరాదు. శుభగ్రహంబులు లగ్నంబునుజూచుచేని శుభంబు గలుగును. ఉచ్చమిత్రస్వక్షేత్ర మూలత్రికోణంబులయందు సూర్యాది గ్రహంబులు తగినస్థలంబులయందుండినేని శుభంబులు గలుగును.

స్తంభప్రతిష్ఠసమయమునకు ఫలము.

గీ॥ శంకుస్థాపనసంభవసంగతులకు । మొదటిజాము త్తమము రెంటమ్యామ
ముమూఁట । నధమమగు నాల్గిటను సంధ్యలందు రాత్రు । లందు
నింద్యముహాస్తు సిద్ధాంతమభవా ॥

తా. శంకుస్థాపనముచేయుటకును, స్తంభప్రతిష్ఠను జేయుటకును మొదటిజాము ఉత్తమము, రెండవయామంబున మధ్యమము, మూడవ యామము అధమము. నాలుగవయామంబునందును, సంధ్యాకాలము నందును, రాత్రులయందును స్తంభప్రతిష్ఠను చేయఁగూడదు.

శంకుదారువు లక్షణము.

గీ॥ చందనముమద్దికానుగు శ్రీచందనంబు । అగరువార్జము కాంచనమ
రిటిపేకు । కొండిశెవెదు రేశ్మపమారేకుకడిమిమేడి । చంద్రమొద
లగుదారువుల్ సంకులభవా ॥

తా. చందనము, మద్ది, కానుగు, శ్రీచందనము, అగరు, వార్జము, కాంచనము, అరిటి, పేకు, కొండిశ, వెదరు, వేప, మారేడు, అత్తి, చంద్ర మొదలగు దారువులు శంకుకు మంచివని యెఱుఁగవలయును.

శంకుదారువుప్రమాణనిర్ణయము,

చ॥ అరయుషడంగుళంబు వెడల్పౌత్తలదారువు శంకువున్నతం ।
బిరువదినాల్గు భూసురుల కిర్వదిమూడు నృపాలజాతికిన్ ।
బరగుదారువైశ్యునకు భాస్కరసంఖ్య చతుర్థజాతికిన్ ।
మఱియునితస్థిమాత్రము సమస్తజనంబులకున్ శుభంబగున్ ॥

తా. ౬ అంగుళంబుల వెడల్పును, ౨౪ అంగుళంబుల పొడవుగల దారువు బ్రాహ్మణులకు ఉచితమయినది. ౨౩ అంగుళంబుల పొడవుగల దారువు క్షత్రియులకు శ్రేష్ఠంబు. ౧౬ అంగుళంబుల దారువు వయిశ్యులకు మంచిది. ౧౨ అంగుళంబుల దారువు శూద్రులకు తగియుండును.

శంకునిర్మాణము.

చ॥ తరువులలోన దోషరహితంబగు దారువు శంకు నేర్పఁగా ।
బరగుసమానసంఖ్యకు త్రిభాగముగాఁగను నట్టి పాళ్ళలో ।
నరయుగమూలమెన్న చతురశ్రమమొప్పిదమౌను మల్ల ।
నరవిగనగ్రభాగము వెనందగు లింగము రీతి మాధవా ॥

తా. మునుపు శంకుకొఱకు చెప్పినదారువులలో నిర్దోషంబులగు దారువును దెచ్చి బ్రాహ్మణాదిగా నాలుగువర్ణంబులవారికిని జెప్పఁబడిన ప్రమాణంబుగలదారువులను కొలమాదిగా మూడుభాగంబులను జేసి మొదటిభాగంబును చౌకంబుగా చెక్కవలెను. రెండవభాగంబును యెనిమిదియంచులుగలుగునట్లు చెక్కవలెను. మూడవభాగంబును లింగాకారంబుగాఁ జెక్కవలెను.

చక్కపాటులక్షణము.

సీ॥ సుముహూర్తమునబరిశుద్ధుడై వడ్రంగిధర్మదేవతను బ్రార్థనము జేసి।
ప్రాగగ్రముగ మ్రానుపరపి చెక్కఁగ జక్కపాటునఫలములు తేటపరతు
చెక్కినచక్కదా జక్కఁగాబడెనేని శుభమగుచేడ్గాను చెక్కయొగసి।
పడెనేని వెలకెలబడినచో రోగంబు తిరుగబడెనేని త్రిప్పటగును॥
గీ॥ ఒంటితునకసనుభమగు రెంటమధ్యమఫలమగు మూటరోగమునాల్గు
నానుకలైనేని దుఃఖంగా నిజము చెక్క। అదిగనుము ప్రాణభయంబు కృష్ణా॥

తా. సౌభాగ్యమగు సుముహూర్తంబునందు వడ్రంగియగువాఁడు పరిశుద్ధుడై ధర్మదేవతను ప్రార్థించి తూర్పుకొనగాదారువునుంచి చెక్కితే చెక్కలు చెక్కలుగాబడినందు ఫలంబులను జెప్పెదను. చెక్కినచెక్క ఆపాటున నేలఁబడినయెడల శుభంబుగలుగును. నెట్టగపడితే కీడు, వెలకిలబడినట్టయిన రోగమగును. తిరుగుడుగా పడితే త్రిప్పటగలుగును, ఒకతునకయ్యెనేని శుభంబు. రెండుతునకలయ్యెనేని మధ్యమంబు. మూడుతునకలయ్యెనేని [illegible], నాలుగుతునకలయ్యెనేని రోగంబు, అనేకతునకలయ్యెనేని ప్రాణహాని [illegible].

వ. మఱియును.

గీ॥ హరిదిశాదిగ దశదిశలందుఁబడిన। చెక్కపాటుకు ఫలములు లక్ష్మిప్రదంబు
భయముసుతహాని నష్టమువయుపోరు। లాభముశుభంబుమృతినిష్ఫ
లంబుకృష్ణా॥

తా. తూర్పుదిక్కు మొదలుకొని పదిదిక్కులయందును బడిన చెక్కపాటుఫలంబును జెప్పబడుచున్నవి. శంకువునకయినను స్తంభమునకయినను మ్రానును చెక్కగా చెక్కినచెక్క తూర్పుదిక్కున బడెనేని శుభంబుగలుగును. ఆగ్నేయంబున భయముగలుగును. దక్షిణంబున పుత్రహాని, నిఋతిని నష్టకొంతువు, పశ్చిమంబున శ్రయాధిక్యము, హా

యవ్యమునకలహము, ఉత్తరంబున లాభము. యీశాన్యంబున శుభము, మీఁదికెగసియున్నతస్థలంబునఁబడెనేని మృత్యువుగలుగును. భూమియందు నాటుకొనెనేని నిశ్చలమయియుండును.

### శంకుస్థాపనవిధి.

గీ॥ కృతసుస్నాతుఁడయి ధౌతకృతవస్త్ర । ధారుడయి భూషణాద్యలంకా
రుఁడగుచు । శంకుహరిద్రాక్షతమిళితగంధాంకితంబు । జేసి ధాన్యము
పయినుంచి చిత్రశుద్ధి ॥

తా. గృహయజమానుఁడు స్నానంబుచేసి వస్త్రాభరణాద్యలంకారంబులను ధరించినవాఁడయి శంకువును పసుపుపూసి గంధపుష్పాక్షతాదు లొసంగి ధాన్యపురాసిమీఁద నుంచవలయును.

గీ॥ స్వస్తిపుణ్యాహవాచనప్రస్తుతముగ । సరవిమంగళతూర్యములు మ్రోగ
యషోడ । శోపచారక్రియాశోభితంబుజేసి । వాస్తుపురుషుని బూజింప
వలయుకృష్ణా ॥

తా. స్వస్తిపుణ్యాహవాచనంబు జేయించి మంగళవాద్యంబులు మ్రోయగా షోడశోపచారపూజలచేత శంఖును బూజింపవలయును.

గీ॥ పేర్మితో వాస్తుపురుషునాభిస్థలమున । హస్తమాత్రప్రమాణగతాం
తరమున । రత్నధాన్యంబులుంచి ప్రయత్నముగను । శంకుస్థాపనము
సేయుసధిమజవ ॥

తా. అట్లు షోడశోపచారపూజను చేసి యాశంకువును వాస్తుపురుషుని నాభిస్థానంబున జేతేడులోతునగుంటద్రవ్వి దానియందు నవరత్నంబులను నవధాన్యంబునుంచి యాశంకువునకు జపనారను జుట్టి యాగుంటలోనిలుపవలయును. శ్లో॥ వాస్తువేపనమస్తేస్తు భూలయ్యాదితతః ప్రభో। మద్గృహం ధనధాన్యాది సమృద్ధిం కురుసంపదం॥ మహామేరుగిరిస్సర్వదేవానామాలయంయథా। తత్త్వం బ్రహ్మాదిదేవానాం మమ గేహస్థిరోభవ॥ అనునట్టి రెండుశ్లోకంబులచేతను వాస్తుపురుషధ్యానంబును జేసి యాగుంటలో నాశంకువును స్థాపించవలయును.

### దిగ్రాశినిర్ణయము.

మ॥ సొరిదిందూర్పున మేషసింహధనువుల్ పొందుయామ్యంబునన్ ।
ధరయుం గావృషకన్యకామకరము ల్వెలుఁగాంచుఁదద్వారుణిన్ ।

పాఱియున్మ్యగ్మతులాఘటంబులు విజృంభించునంత నేశస్థలిః ।
దిజమయికర్కిఝషపాళిరాములు మహాదేవాది దేవస్తుతా ॥

తా. తూర్పున మేషసింహధనుస్సులు 3 మూడునునుండును. దక్షిణమున వృషకన్యామకరములు 3 మూడును నుండు. పశ్చిమంబున మిథునతులాకుంభములు మూడును నుండును. ఉత్తరంబున కర్కవృశ్చికమీనంబులుండును. యేదిక్కురాసు లాదిక్కుననే తొలగకయుండును.

వాస్తుపురుషదృష్టి ద్వారనిర్ణయము.

గీ॥ తెలియంగ వాస్తుపురుషుఁడేదిక్కుజూచు। నచట ద్వారములుంచగ పొందు సుఖము। యితరమగు చోట్లనుంచిన ధృతిదొలంగి। రోగశోకం బులగును సరోజనాభ॥

తా. వాస్తుపురుషుఁడేదిక్కునుజూచుచుండునో యాదిక్కునదల వాకిలిని బెట్టినయెడల ధనప్రాప్తియును శుభంబులునుగలుగును. వాస్తుపురుషునకు బాదంబులయందుగూడ దృష్టి కలిగియుండును కనుక యచ్చోటగూడ ద్వారంబును బెట్టవచ్చును. అట్లుగాక తక్కినదిక్కుల యందు ద్వారంబును బెట్టితే రోగంబుగలుగును.

మాస ద్వార నిర్ణయము.

మ॥ మునుదా శ్రావణికంబునందు బవసంబుల్గట్టినం దూర్పది ।
క్కయినన్వాకిలినిల్పి కార్తికమునం దింపొందనదక్షిణం ।
బునమ్మాఘమునందు బశ్చిమదిశన్ బొందింపయుక్తంబగున్ ।
జనువైశాఖమునందునుత్తరదిశన్ వాసస్థోత్కీర్తిసర్వేశ్వరా ॥

తా. శ్రావణమాసంబున గట్టెడుగృహంబునకు దూర్పుదిక్కున దలవాకిలినుంచవలయును, కార్తికమాసంబున దక్షిణద్వారముంచవలయును. మాఘమాసమున బశ్చిమద్వారంబును బెట్టవలయును. వైశాఖమాసంబున నుత్తరంబున ద్వారంబును బెట్టవలయును ఇతరమాసంబులయందు గృహంబులను గట్టరాదు.

సౌరమాసమాస నిర్ణయము.

సీ॥ కర్కసింహంబులనర్కుఁడుండినదూర్పు దిక్కువాకిళ్లువలెన్ల్లవచ్చు। దులవృశ్చికంబులనెలమిభానుండుండశమనదిఙ్ముకముద్వారంబుపన రు। మకరకుంభంబులమార్తాండుఁడుండిన బశ్చిమద్వారమింపొంద వలయు। మేషవృషభంబులమిహిరుండునెలకొన్నయుత్తరద్వారంబు

నునుపవలయు॥ గీ॥ మెరసికన్యచాప మీనయుగ్మంబుల । గట్టరాదు గృహముగట్టిరేని। వ్యాధిహానిగండభాధలుసిద్ధించు । ననుచువాస్తు కర్తలనిరికృష్ణా ॥

తా. కర్కాటక సింహమాసంబులయందు గృహంబులను గట్టిరేని తూర్పుభాగంబున ద్వారంబును బెట్టవలయును. తులా వృశ్చిక మాసంబులయందు గృహములనుగట్టిరేని దక్షిణద్వారంబును బెట్టవలయును. మకరకుంభమాసంబులయందుగృహంబులనుగట్టిరేనిపశ్చిమపు ద్వారంబును బెట్టవలయును. మేషవృషభమాసంబులనుగట్టిరేని యుత్తరపుద్వారంబున బెట్టవలయును. కన్యామిథునధనుర్మీనమాసంబులయందుగృహంబులనుగట్టరాదు. కన్యామాసంబునందు గృహంబులనుగట్టినయెడల వ్యాధులుగలుగును. ధనుర్మాసంబున గట్టినటులైతే హానిగలుగును. మిథునమాసంబునందు గృహంబునుగట్టిరేని ప్రతిమాసంబును మృత్యుభయముగలుగును. ఈప్రకార వాస్తుశాస్త్రంబునందలి గృహంబులను గట్టినయెడల నానావిధంబులైన శుభంబులుగలుగును.

కర్తయొక్కరాశికనుకూలమైనద్వారనిర్ణయము.

చ॥ దలనుగదూర్పుదిక్కు తలవాకిలివృశ్చిక మీనకర్కిరా ।
సులభగువారికిన్నమను పోటునుయుగ్మ మృగాంగనాదిరా ।
సులభగువారికిన్ నరుణు చోట తులావృషకుంభరాశివా ।
రలకును కార్ముకాజహరి రాసులవారికి నుత్తరంబజా॥

తా. వృశ్చికమీనకర్కాటక రాసులవారికి తూర్పుభాగంబున ద్వారంబుపెట్టుటమంచిది. మిథునమకరకన్యారాసులవారికి దక్షిణపుశ్రేష్ఠవద్వారంబు మేలునుగలుగజేయును. తులావృషభకుంభరాసులవారికి బశ్చిమపుద్వారంబుశుభంబును గలుగజేయును. మేషసింహధనూరాసులవారికి నుత్తరపుద్వారము మంగళమును గలుగజేయును ఇప్పుడు చెప్పబడిన కర్తయొక్క రాశీశ్వరులకును గృహరాశీశ్వరులకు మిత్రత్వముగనుక గ్రహమైత్రిద్వారమనబడును.

అష్టభాగద్వార ఫల నిర్ణయము.

సీసమాలిక॥ ప్రాగాదిదిశలకుభాగఫలద్వారనిర్ణయంబానరంతునేర్పు
మీర। నొక్కొక్కపాల్యానర నెన్మిదిజేయసీశానమాద్యమైయింద్రుడి
శకు। హానిలోకముగర్థమాధుపున్మాసంబు ధనముశౌర్యముక్రోధము

సుభయంబు। ఫలములై చను బహిర్ద్వార దేశంబులకు నాగ్నేయమారభ్య
మైయమునిదిశకు। ప్రాణభయంబును బంధనంబును భీతియర్థసంప్రాప్తి
ధాన్యాభివృద్ధి। సుఖదుఃఖరోగములన్నరిది ఫలంబులు పలరాశిదిశమొ
దల్వరుణాదిశకు। సుతహానిరిపువృద్ధిసుఖముధనప్రాప్తి కలిమిశోకంబు
రోగమును భయము। ఫలములు పరుసతోపనమానుడాదిగా నుత్తర
మునను వెంబొందు నెపుడు॥ గీ॥ సరవితో భార్యనింద యు సత్వనష్టి।
హానిధాన్యాభివృద్ధిధనాగమంబు। పరమసౌఖ్యముదుఃఖము బాధ
లనెసి। ఫలము తెలుగక ద్వారము ల్నిలుపదగదు॥

తా. ప్రాగాదినాలుగుదిక్కులలో నేదిక్కునద్వారంబును బెట్టిన
ను ప్రతిదిక్కును ఎనిమిది భాగంబులుగా జేయవలయును. అట్టియెడ యెని
మిది భాగంబులకును క్రమంబుగ ఫలంబును జెప్పుచున్నారు. తూర్పుదిక్కు
నద్వారంబుబెట్టుటకు నిర్ణయించినయెడల ఈశాన్యము మొదలుకొని
యాగ్నేయమువఱకును కొలిచి యెనిమిది భాగంబులను జేయవలయును.
అట్టియెనిమిది భాగములలో ౧ హాని, ౨ శోకము, ౩ అర్థప్రాప్తి, ౪
రాజసన్మానము, ౫ ధనప్రాప్తి, ౬ సౌఖ్యము, ౭ క్రోధము, ౮ భయము.
దక్షిణద్వారంబునకు నాగ్నేయంబు మొదలుకొని నిబుబుతివఱకును ౮
భాగంబులు సేయగా ౧ ప్రాణభయము, ౨ బంధనము, ౩ భయము, ౪
అర్థప్రాప్తి, ౫ ధాన్యవృద్ధి, ౬ సుఖప్రదము, ౭ దుఃఖము, ౮ రోగము.
పశ్చిమపుద్వారంబునకు నిబుబుతిదిశ మొదలుకొని వాయువ్యమువఱ
కును ఎనిమిది భాగంబులు సేయగా ౧ సుతహాని, ౨ శత్రువృద్ధి, ౩ సుఖ
ము, ౪ ధనప్రాప్తి, ౫ కలిమి, ౬ శోకము, ౭ రోగము, ౮ భయము.
ఉత్తర ద్వారమునకు వాయువ్యము మొదలుకొని యీశాన్యమువఱకును
నెనిమిదిభాగములు సేయగా ౧ భార్యానింద, ౨ బలహీనము, ౩ హాని,
౪ ధాన్యాభివృద్ధి, ౫ ధనాగమము, ౬ సౌఖ్యము, ౭ దుఃఖము, ౮ బాధ
కము. ఈ భాగంబుల యొక్క ఫలముల నెఱింగి గృహద్వారమును
పెట్టుట మంచిది.

## గృహభాగఫలద్వారనిర్ణయము.

సీ॥ శివశిఖిదైత్యవాయువులాదిగాగ బ్రాగ్దక్షిణపశ్చిమోత్తరములందు।
నవభాగములు సేయరవిశశికుజబుధేజ్యశుక్రవిసూర్యాత్మజసైంహికేయు

కేతుస్థలములోనుగీష్పతిపై దేవతులకు శుక్రునిమీదనిలుచునరులు।
నిండ్లకుబశువులకెలమిసౌమ్యునిమీద సచ్ఛత్రకవిగురుసౌమ్యులందు।
గీ॥ నిల్లువెడలగవాకిలియించుకధిక। ముంచియినుపకవాటంబులునుపవల
యు । మఱియుబాపగ్రహస్థాన మధ్యమమున । నిలుపరాదు బహి
ద్వార నియతికృష్ణ॥

తా. ఈశాన్యము, ఆగ్నేయము, వాయువ్యము, నిఋఋతి అను నాలుగుమూలలను అదిశేకుకొని తూర్పుద్వారంబున నీశాన్యము మొదలుచేసికొని యాగ్నేయమువఱకునుకొలిచి తొమ్మిదిభాగంబులు సేయగా మొదటిభాగంబునకు సూర్యుడు, రెండవభాగంబునకు చంద్రుడు, మూడవభాగంబునకు అంగారకుడు, నాలుగవభాగంబునకు బుధుడు, అయిదవ భాగంబునకు బృహస్పతి, ఆరవ భాగంబునకు శుక్రుడు, యేడవభాగంబునకు శని, యెనిమిదవభాగంబునకు రాహువు, తొమ్మిదవభాగంబునకు కేతువు, అధిపతులు. యీ తొమ్మిదిగ్రహంబులలో బృహస్పతియొక్క భాగంబునందు దేవతులయొక్క గృహములకు ద్వారములను బెట్టవలయును. శుక్రభాగంబునందు మనుష్యులకును, బుధునిభాగమునందు బశువులకును, ద్వారంబును బెట్టవలయును. ఈ భాగములలో నెవ్వనిభాగమునందు ద్వారమునిలువబడుచున్నదో యీ భాగమునందు యెడమదిక్కుకొంచెము అధికముగానుండునట్లుచేసి ద్వారమునుబెట్టవలయును. ద్వారమునకుయెడమదిక్కున తలుపునుబెట్టవలయును. దక్షిణద్వారంబునకునాగ్నేయము మొదలుపశ్చిమద్వారంబునకునిఋఋతిదిగ్భాగము మొదలు ఉత్తరద్వారమునకునాయువ్యము మొదలుకొనియునుకొలిచిపైనజెప్పినప్రకారము ద్వారములనుబెట్టవలయును.

## ద్వారబంధలక్షణము.

గీ॥ సప్తతాళోన్నతంబునెంచగద్రితాళ। మాయతముద్వారబంధంబు
లెందుదగును।నిడుపుతొమ్మిదిపాలునువెడల్పుపైడు। పాళ్ళయోనయిన
దగుద్వారబంధమబవా॥

తా. ఏడుజానలపొడవు, మూడుజానలవెడల్పునుగల ద్వారబంధము యోగ్యమైనది మఱియును నిడుపుతొమ్మిదిపాలును, వెడల్పు అయిదుపాలునుగల ద్వారబంధము శ్రేష్ఠమైనది యగును.

సందును "శ్లో॥ రోహిణీమృగచిత్రార్కవాసవోత్తరవైశ్వభమ్। శ్రవణం స్వైనతు భాస్తష్టపుప్రశస్తాగృహకర్మణి॥" దీనికి అర్థభేదములేదు.

స్తంభప్రతిష్ఠకు గ్రహస్థితి లగ్ననిర్ణయము.

గీ॥ లగ్నకేంద్ర త్రికోణములయందు। నుచ్చలందును శుభులున్నజూచి
చేసి। పాపులారింటమూటనుపదునొకంట। నుండిరేనియు స్తంభము
లుంచశుభము॥

తా. లగ్నమునందును లగ్నమునకు నాలుగు, ఏడు, పది, అయిదు, తొమ్మిది స్థానములయందు శుభగ్రహములుండినను చూచినను ఈ రాసులయందు శుభగ్రహము ఉచ్చస్థితుడై యుండినను పాప గ్రహములు ఆరుమూడు పదునొకండు స్థానములయందుండినను స్తంభప్రతిష్ఠయును జేయుటయుచితము.

స్తంభఘాతమునకు గాలసర్పగతిని వివరణము.

సీ॥ కాలసర్పమువక్రగాసంచరించు మరహిమించువృషభాదిరాసులం
ము।హరదిశశీర్షంబునిలదిఙ్మధ్యంబునసురదికుచ్ఛమైయులరియుండు
సింహత్రయంబున శిరమువాయువునందు నసురదిఙ్మధ్యమై యగ్ని
పుచ్ఛ। మగునళిత్రయముననసురదిక్శిరముగ నగ్నిదిఙ్మధ్యంబుహరు
నిదిశను॥గీ॥ పుచ్ఛమాకలశత్రయమునను వహ్ని। మూలతలయుండు
మధ్యంబుఘాలనయును। దెసనుపుచ్ఛంబువాయువుదిశజెలంగు। నిట్టి
గతులందు గాహ్యంబు లెఱుగవలయు॥

తా. వృషభమిథునకర్కట మాసంబులయందు కాలసర్పము నకునీశాన్యమునశిరస్సును, వాయువ్యముననడుమును, నిఋఋతియందు దోకయుండును. పిమ్మటపశ్చాద్గమనముతోవచ్చి సింహకన్యతులా మాసములయందు వాయువ్యమున శిరస్సును, నిరుతి దిక్కునందు నడుమును, ఆగ్నేయమున దోకయును గలదియై యుండును. వృశ్చిక ధనుర్మకర మాసములయందు నిరుతిదిక్కున శిరస్సును, ఆగ్నేయమున నడుమును, ఈశాన్యమున దోకయును గలదియై యుండును. కుంభ మీన మేష మాసములయందు ఆగ్నేయమునశిరస్సును, ఈశాన్యమున నడుమును, వాయువ్యమున దోకయును గలదియై యుండును. కాబట్టి యిట్టిగతులయందు యుక్తాయుక్త స్థానములను దెలిసి స్తంభ ఘాతము చేయవలయును.

క॥ తలమీద త్రవ్వ మృత్యువు। వలనొప్పగి పీపునందు వచ్చును బీడల్ ।
చలసంబు తోకమీదను । చెలువుగ విడు పైనదిశను సంపద కృష్ణా॥

తా. కాలసర్పము యొక్క శిరస్సుమీద త్రవ్వినయెడల మృత్యుభయంబు కలుగును. పీపుమీద త్రవ్వినయెడల పీడలు కలుగును. తోకమీద త్రవ్వినయెడల జలనమును కలుగజేయును. ఈ మూడు చోట్లను గాక నిడుపైన స్థానములయందు త్రవ్వితే శుభము కలుగును.

సూర్యచంద్రగతులకు ఫలము.

సీసమాలిక॥ కర మొప్ప వృషయుగ్మ కర్కాటకంబుల సూర్యుడు చరియింపసోముడపుడు। సింహత్రయంబున స్థిరముగా నుండిన వహ్నిదిశం బైన వచ్చును కము। కంఠీరవంబున కన్యను ద్రాసున బద్ధ బాంధవుడున్న బద్ధవైరి। యళికళ త్రయంబున నలదిన సమయంబు నీశాన్య దిశయందు నెనయు శుభము। ఇక ధనుర్మృగముల నాదిత్యుడుండగ గలుపల చెలి కాడు నెమ్మితోడ। గుంభత్రయంబున గుమురుగా నుండిన నిలనాయివం బైన వాసగు జయము। ఘటఝషాజములందు ధరణిచర్తింపంగ రిక్కలగమికేమనిక్కముగ। వృషభత్రయంబున నొప్పుగా నుండిన నసురకోనమునందు నొనరు జయము॥ గీ॥ ఆలయంబులకీరీతి నలరు స్తంబ। ఘాతములు సేయ శుభములు గలుగునవ్వ। మూర్గముల చేయ బీడలు మానవెపుడు । దెలిసివర్తింపవలయును దేవదేవా॥

తా॥ వృషభ మిధున కర్కాటక మాసంబులయందు సూర్యుడుండగాను సింహ కన్యా తులా సంబంధమైన యుత్తర హస్త చిత్తలయందు చంద్రుడుండగాను యాగ్నేయమున స్తంబగాతము చేయవలయును. సింహకన్యతులా మాసంబులయందు సూర్యుడుండగా వృశ్చిధనుర్మకర సంబందమైన యనూరా ఉత్తరాషాడ శ్రవ ధనిష్టలను నాల్గు నక్షత్రములలో నెద్దానియం దైన జంద్రుండు సంచరించు సమయమునందు నీశాన్యపు దిగ్భాగమునందు స్తంబగాతము చేయవలయును. వృశ్చిక ధనుర్మకర మాసములయందు సూర్యుడుండగా కుంభ మీన మేషసంబంధమైన శతభిషోత్తరాభాద్ర రేవత్యశ్వినులును నాల్గు నక్షత్రములలో నెద్దానియం దైన సూర్యుడు సంచరించు నపుడు వాయువ్య దిగ్భాగమునందు స్తంభ ప్రతిష్టను చేయవలయును. కుంభ మీన మేష సంక్రాంతులయందు సూర్యుడుండగా వృషభ మిధున కర్కాటక సంబం

ధమైన రోహిణి మృగశీర్ష పునర్వసు పుష్యములను నాలుగునక్షత్రములలో నెద్దానియందైన చంద్రుడు సంచరించునపుడు నిరుఋతిదిగ్భాగంబునందు స్తంభప్రతిష్ఠలు జేయవలయును. ఇట్లు విచారించి స్తంభప్రతిష్ఠను జేసినయెడల శుభములుగలుగును. లేనియెడల నశుభములు కలుగును.

## వివాహవేదికాస్తంభలక్షణము.

సీ॥ మృగపతిత్రయమున మిహిరుడునెలకొన్న హరునికోణంబుననమరవలయు । నళికత్రయంబున హరిదశ్వుడుండిన ననిలకోనమునందు నునుపవలయు। గలశత్రయంబున మలాప్తుడుండిన దైత్యకోణాదిగా దలపవలయు । వృషభత్రయంబున నుష్ణదీధితియున్నజ్వలనదిశాదిగా జెలుపవలయు॥ గీ॥ ధరణిపరిణయవేదికాస్తంభసమితి । నిలుపుటకువాస్తుశాస్త్రోక్తనిర్ణయంబు । గాకవేరొక్కవిధమునఘాతమయిన । సంపదలులేకహానిసూ... ...క్కు ॥

తా. సింహము,కన్య,తుల ఈ ... ...షయందును సూర్యుడు సంచరించుచుండగా నీశాన్యము ... ...ంభఘాతము చేయవలయును. వృశ్చిక మకర దనుల ... ...సూర్యుడుండగా వాయువ్యదిగ్భాగమునందు స్తం... ...యును. కుంభ మీన మేషలగ్నములయందు స... ...దిగ్భాగము నందు స్తంభఘాతమును చేయవ... ...కర్కాటక రాసులయందు సూర్యుడుండగ ... ...స్తంభఘాతము చేయవలయును. ఇ... ...జేయవలయును. ఇట్లు చేయక వ... ...రిద్ర మును దంపతులకు హాని...

ల గ...

గీ॥ పరమలగ్నము...
మునన...
ద్ధ...

గరిమన్నంతుపద్దకొంట నెలకొన్న న్వయిభవప్రాప్తిని।
ధ్ధరమీదజ్జీరకాలమున్నను గృహస్తంభంబుల న్నిల్పగ॥

తా. మీనలగ్నంబున శుక్రుడున్న నాలుగిట బృహస్పతియును వీరిరువురును నుచ్చస్థానంబులయందైనను శని పదునొకటియునుండగా గృహంబునకు స్తంభప్రతిష్టను జేసినయెడల నాగృహము చిరకాలము సకలయిశ్వర్యంబుల తోడను గూడియుండును.

మ॥ అమరాచార్యుని రాశికారిటను సప్త్వానుండు శుక్రుండును।
త్తమరాశిన్దశమంబున న్శశియు లాభస్థానమున్సారి పం।
చమరాశి న్బుధుడున్నవేళ గృహము స్తంభప్రతిష్టల్మహో।
త్తమమయియుండు ననేకవత్సరములు న్ధాత్రీస్థలిన్మాధవా॥

తా. లగ్నంబున బృహస్పతియుండగా పతనికి నారింట సూర్యుడును మేడిట శుక్రుడును, పదింట జంద్రుడును పదనొకంట శనియును, అయిదింట బుధుడు నివసించియుండిరేని స్తంభప్రతిష్టను జేయుట యుత్తమము. మఱియును సిట్టిలగ్నంబున గృహంబు శాశ్వతమయిన సంపద గలదయి యుండును.

## ఆయురారోగ్యము.

మ॥ గురియూ లగ్నమునన్సరాగురుడు శుక్రుండయిన నుండంగి మం।
దిరముల్గట్టిన నూరువత్సరములు దీపించు సౌఖ్యంబుభా।
సురతన్నిల్చిన నేబదేండ్లును సితోర్వీస్థలిన్నీవు ము।
వ్వురులగ్నంబున నుండిరేని విభవంబు ల్జెందునెల్లప్పుడున్॥

తా. లగ్నంబునందు గురుశుక్రులలో నెవరైన నొకరుండగ గట్టినగృహము నూరుసంవత్సరంబులు సుఖస్థితిగలదైయుండు. లగ్నంబునబుధుండెనేని యేబది సంవత్సరములుండును గురుశుక్రబుధులు మువ్వురునుండిరేని యనేక సంవత్సరములుండును.

గీ॥ రమనకంబములోగి నిల్చు సమయమునను। గురుడు చంద్రుడు నాల్గింట గుజుడు శనియు। పదునొకంటను నిలిపిన బవసములకు। నాయువగునంద్రుడు నెనబదియబ్దములును॥

తా. స్తంభప్రతిష్టను చేయులగ్నంబునకు గురుచంద్రులు నాల్గింటను కుజశనులు పదునొకంట నుండిరేని యాగృహ మెనుబది యేండ్లు సకలైశ్వర్యంబులును గలదైయుండును.

గీ॥ లగ్నమునశుక్రుఁడుండగ ననబుధుండు। పదవకేంద్రమునందుగీష్పతి
యుధరణి। పదునొకటనున్న గంభముంబ్రాతుకొల్ప। నిలయము
శతాబ్దములు ధాత్రినిలుమగృష్ణా॥

తా. లగ్నంబునశుక్రుడును పదియవయింట బుధుడును గురుడు సూర్యుడు పదునొకండవ స్థానంబునందును నివసించియున్న సమయంబునందు గట్టినగృహము నూరుసంవత్సరములు పరమైశ్వర్యంబుతో నుండును.

క॥ కవిలగ్నమునను మూటను। రవికుజులారిటను గురుడురహిన్నైదింటన్।
నివసించునపుడు కంబము। భువినిల్పశతద్వయాబ్దములు వర్తిల్లున్॥

తా. లగ్నంబునందు శుక్రుడును, సూర్యుడు మూడింటను, అంగారకుడు ఆరింట, గురుడు అయిదింటను నుండగా గట్టినగృహంబు రెండునూరుల సంవత్సరములు పరమైశ్వర్యంబుతోనుండును

సీ॥ తనరుదూర్పాది ప్రదక్షిణంబుగ దూలములు చౌకములు గూర్ప
వలయునపుడు। ఆగ్నేయమునను మూలాగ్రసంయోగంబు మూలం
బుమూలంబు మొనయున్నైఋత్య। దిక్కునబవమానదిశయగ్రమూల
సంఘటనంబునీశానుకడనుబొల్చు। నగ్రమగ్రముననిక విధానములు
తూర్పుగజమైన బోతుభానుజునికడను॥

గీ॥ వృషభము పడమట నుత్తరంబెనయ నజము। గజముపై పోతు
పోతుపైకడగు వృషము। వృషభగజములపై నజంబెసగువరుస।
తెలిసిదూలములెత్తగా వలయుగృష్ణా॥

తా. దూలములను జౌకంబుగాఁ గూర్చునపుడు తూర్పుదూలంబుయొక్క మొదలును దక్షిణదూలంబుయొక్క కొనయును నాగ్నేయంబున గూడవలయును. దక్షిణపుదూలంబుయొక్క మొదలును, పడమటి దూలంబుయొక్క మొదలును, నిఋుతిభాగంబున గూడ వలయును. పడమటి దూలంబుయొక్క కొనయును, ఉత్తరపుదూలంబుయొక్క మొదలును వాయువ్యమున గూడవలయును. ఉత్తరపుదూలంబుయొక్క కొనయును, తూర్పుదూలంబుయొక్క కొనయును, ఈశాన్యంబున గూడవలయును. తూర్పుదూలంబులను గజమనియును, దక్షిణదూలంబు ఎనబోతనియును, పడమటిదూలంబు వృషభమనియును, ఉత్తరపుదూలంబు చింబోతనియును జెప్పబడును. కాబట్టి

యేనుగుమీద నెనబోతును, ఎనబోతుమీద నెద్దును, ఎద్దుమీద నేను
గును, ఏనుగుమీద చింబోతును బెట్టవలయును. ఈవిధమంతయును
జక్కగ నెఱిగి దూలంబులను మోపుచేసినటులైతే పరమైశ్వర్యంబు
గలిగి యుండును.

దారుసంధినిగూర్చులక్షణము.

ఉ॥ మూలము శక్తిరూపము సమున్నతిసగ్రము శంభురూపమౌ।
మూలమునగ్రమున్గదియ ముఖ్యపదంబగు నగ్రమగ్రముల్।
మేలుదొలంగ జేయుగృహమేధికి మూలము మూలముల్ శిఖ।
జ్వాలము జేర్చు దారువుల సంధియెఱుంగక యిండ్లుగట్టినన్॥

తా. దూలంబుయొక్క మొదటిభాగంబు శక్తిస్వరూపము, కొన శంభుస్వరూపము కాబట్టి మొదలుచివరలు రెండును జేర్చిన యెడల శుభంబులు గలుగును, కొనయు కొనయుగూర్చినయెడల గీడు గలుగును. మొదలును మొదలును జేర్చినయెడల నగ్నిభయముగలుగును, కావున దారుసంధులనెఱిగి గృహంబులను గట్టుట యుచితము.

క॥ ప్రాగుత్తరాగ్రములుగా। బాగుగ గృహదారుసమితిబరపిన శుభమౌ।
రోగము దక్షిణపశ్చిమ। భాగాగ్రమునైన బరగు మహిని మురారీ॥

తా. ఇండ్లకు దారువు తూర్పు ఉత్తరము కొనలుగా భరించిన యెడల శుభప్రదము. దక్షిణపడమర దిక్కులభరించిన యెడల గృహ యజమానునకు రోగము గలుగును.

గీ॥ కంబములులేక నిలయంబు గట్టరాదు। కంభములు చాలుదప్పిన
కంబసూడు। బేసిదంతెలు మూలముల్పెరయుసరుల। పొరుగుకొట్ట
మునుపోటు పొసగదబవా॥

తా. కంబములులేక యిండ్లను గట్టరాదు, కంబములు చాలు దప్పితే కంబసూడు గనుక కీడుగలుగును. దంతెలు బేసిగానుండవలయును రూపంబులు సరిగానుండవలయును. పొరుగువారికొట్టంవెన్నుపోటియుండరాదు. తనయింటియందైనను వెన్నుపోటియుండరాదు.

గృహోన్నతసూత్రము.

గీ॥ మూలమునకును భూమికసూలుపట్టి। ఎన్నియంగుళమగునవి యెని
మిదింట। పాలుగొని శేషమాయము ల్పరగునందు। బేసులు
శుభంబుసమలందు బెరయుగీడు॥

తా. దూలములకును కిందికినిమాత్రంబునుబట్టి యామాత్రము నయంగుళాలచేతగొలిచి ౮ దిటభాగించగా ౧ మిగిలి తేధ్వజాయము, ౨ మిగిలినయెడల ధూమ్రాయము, ౩ మిగిలినయెడల సింహాయము, ౪ మిగిలినయెడలశునకాయము, ౫ మిగిలినయెడలవృషభాయము, ౬ మిగిలినయెడలఖరాయము, ౭ మిగిలినయెడల గజాయము, ౮ మిగిలినయెడల గాకాయము, ఈ యెనిమిదివిధములయిన యాయంబులలో కర్తకు అనుకూలమయిన పేసియాయమును ఉంచవలయును.

గీ॥ తల్లిదండ్రియునన్నలుదక్షిణమున । బశ్చిమంబుననుండినభద్రమగును । ఉత్తరముజరపలోగిలతెంతమేలు । దక్షిణంబునుపడమరతగదుజరప ॥

తా. తల్లిదండ్రులయొక్కయు, అన్నలయొక్కయు, గృహంబులు దక్షిణపువైపుననైనను, పడమరపువైపుననైనను ఉండవలయును. వీరికిదిగువను చిన్నవారలయిండ్లు ఉండవలయును ఇండ్లుండుటచే శుభముగలుగును ఉత్తరపువైపునకును తూర్పువైపునకును జరగవచ్చును దక్షిణంబునకు బడమరవైపునకును జరగకూడదని తెలియవలయును.

సీ॥ నలుదిశల్వాకిల్లుగల యేకశాలకు విశ్వతోముకమను వెలయుపేరు । ప్రాద్వారరహితమై పరగువ్యాఘ్రుదాఖ్య పశుమృగతస్కర బాధలొదవు । ఇలదక్షిణద్వారహీనమౌగృహశేకరాఖ్యాత మఖిలభాగ్యప్రదంబు । వరుణదిశద్వారహీనత శ్రీనిలయాఖ్యంబు పుత్రపౌత్రాభివృద్ధి॥ గీ॥ ఉత్తరద్వారరహితమైయున్నశాల। సూకరపదాఖ్యరాజ్యభయంకరంబు । లాపరాంచితకోనమధ్యముననిదియె। పుండరీకాఖ్యదగశుభంబులునొసంగు ॥

తా. నాలుగుదిక్కులను వాకిల్లుగలగృహము విశ్వతోముకమనిపించుకొనును, అందుకుఫలము వృద్ధిప్రదము తూర్పునద్వారంబులేక యితరములగు దిక్కులయందుమాత్రము ద్వారంబుగల గృహంబు వ్యాఘ్రపదమనిపేరు. అందుకుఫలము పశుమృగతస్కరబాధలుగలుగును. దక్షిణద్వారంబులేక యితరదిక్కులయందుమాత్రము వాకిల్లుగలిగియుండెనేని యదిగృహశేఖరమనిపించుకొనును. అందుకుఫలము భాగ్యప్రదము. పడమటదిక్కునద్వారంబులేక యితరములయినదిక్కులయందు ద్వారంబులుగలిగియుండెనేని యాగృహంబు శ్రీనిలయమని

చెప్పబడును. అందుకుఫలము పుత్రపౌత్రాభివృద్ధి. ఉత్తరమున ద్వారములేక యితరములగు దిక్కులయందు ద్వారంబులుండెనేని అది సూకరపదమనిపించుకొనును. అందుకుఫలము రాజభయము. ఈవిశ్వతోముఖమేగూడలులేక వెలితిగా కోనమధ్యంబునగట్టితే పుండరీక మనిపించుకొనును. అందుకుఫలము శుభంబుగలుగును.

సీ॥ యామ్యపశ్చిమముల యొనరుద్విశాలాక్య కమలాకరములక్ష్మిఁ గలుగ జేయు । పశ్చిమోత్తరములబరగుద్విశాలకు శ్వానపదాఖ్యత స్కరభయంబు । ఉత్తరప్రాగ్దిశలుష్ట్రదంష్ట్రాహ్వయం బతిఘోర భయమునార్తియును జేయు । పూర్వదక్షిణమును పొసగుద్విశాలాఖ్య భుజగదంష్ట్రవిషంబులభయంబు ॥ గీ॥ కాన తద్విశాలలక్షణక్రములనరసి । గృహములలోమేలు నధిపునకును । మొనసి తత్తత్ఫలంబులు నెనయజేయు । వాస్తుసిద్ధాంతమతమిది వారిజాక్ష ॥

తా. దక్షిణపుపారునను, పడమటిపారువను కట్టిన, ద్విశాల కమలాకరమని చెప్పబడును. పడమటిపారువను, ఉత్తరపుపారువను కట్టిన ద్విశాలశ్వానపదమని అనఁబడును. దీనికిఫలము చోరభయము. ఇంతయగాక పీడయునుగలుగును. ఉత్తరపారువను తూర్పుపారువను గట్టిన ద్విశాలదంష్ట్రము. దీనికిఫలము చోరభయము. తూర్పుపారువను, దక్షిణపుపారువను గట్టిన ద్విశాలభుజగదంష్ట్ర మనిపించుకొనును. దీనిచేత విషయంబులుగలుగును. కాబట్టి ద్విశాలలక్షణములను దెలిసి గృహంబులను గట్టవలయును.

## త్రిశాలలక్షణము.

సీ॥ సరవిపూర్వముఖ త్రిశాలాఖ్యగృహమున హరిపదమిష్ట కామ్యార్థసిద్ధి । శమనదిఙ్ముఖ త్రిశాలోష్ట్రదంష్ట్రాఖ్యకము శత్రుభీతి వేగమెయొనర్చు । వరుణాదిఙ్ముఖమం త్రిశాలక్షయాభిధానంబు బహుహానిగలుగజేయు । నలరును దిఙ్ముఖమైనత్రిశాల జయంతినాపుత్రపౌత్రాభివృద్ధి॥ గీ॥ రమనదిఙ్ముఖహీనమై రమణనితర । దిశలమూటనుద్వారములెవ్వదముగను। సమరినత్రిశాలకల్యాణ మొసగజెల్లు। సకలసంపత్ప్రదాయకంబగునుకృష్ణ ॥

తా. దక్షిణము పడమర ఉత్తరము ఈమూడుదిక్కులు కట్టి తూర్పువసువునుచేసి యక్కడవాకిలిబెట్టినయెడల హరిపద మనిపించు

కొనును, అందుకుఫలము ఇష్టకామ్యార్థసిద్ధి గలిగియుండును. పడమర ఉత్తరము తూర్పు యీమూడుదిక్కులను గృహంబులను గట్టి దక్షిణంబుననిడువుసేసి యక్కడ వాకిలిపెట్టితే ఉష్ట్ర(దంష్ట్ర) మనిపించుకొనును, అందుకు ఫలము శత్రుభయము. ఉత్తరము తూర్పు దక్షిణము ఈమూడుదిక్కులయందును గృహంములుగట్టి పడమర విడువుజేసి యక్కడవాకిలిపెట్టితె క్షయమనిపించుకొనును. అందుకుఫలము హానిగలుగుట. తూర్పు దక్షిణపడమర్లయందు గృహమునుగట్టి యుత్తరముల విడువుజేసి యక్కడవాకిలి పెట్టితే జయంతియనిపించుకొనును. దీనికి ఫలము పుత్రపౌత్రాభి వృద్ధిగలుగుట. దక్షిణద్వారములేక తూర్పుపడమర వుత్తరములయందు ద్వారములుండెనేని కల్యాణమనిపించుకొనునుఅందుకుఫలము సంపదలుగలిగియుండుటయని తెలియవలయును.

చతుశ్శాలలక్షణము.

సీ॥ దిశలునాల్గిటియందు విశదంబుగాగట్టు సదనంబుధరజతుశ్శాలయయ్యె। అదిసర్వతోభద్రమదిచతురద్రికయను సమాహ్వయముల నలరు నెపుడు। స్వస్తికాహ్వయముల బ్రాగ్ద్వారసంయుతమైన పశుకరితురగ సంపత్కరంబు। దక్షిణద్వారమై తగువర్ధమానాహ్వయమునస్తు వర్ధమానమునజెలగు॥ గీ॥ భూమినిదగును సంధ్యావర్త నామమున। బశ్చిమముఖంబున రత్నసంపద లొసంగె। దనరు చక్రాఖ్య నుత్తరద్వారమైన। నన్నపానాదిభోగభాగ్యంబులొసగు॥

తా. తూర్పు దక్షిణము పడమర ఉత్తరము, ఈ నాలుగు దిక్కులను గృహమునుగట్టినయెడల నది చతుశ్శాలయనియును, సర్వతోభద్రమనియును జెప్పబడును. ఇట్టి చతుశ్శాలకుతూర్పున ద్వారమును బెట్టినయెడల స్వస్తికమని యెన్నబడును. ఇట్టి గృహమునందు పశువులు, ఏనుగులు, గుఱ్ఱములు, మిగుల సభివృద్ధిని జెందుచుండును. దక్షిణమున ద్వారముగల గృహము వర్ధమానమను పేరుచే నొప్పియుండును. ఈవర్ధమానమను పేరుగల గృహమునందు శాశ్వతంబుగ ధనముగలిగియుండును. పశ్చిమంబున ద్వారంబుగల చతుశ్శాల సంధ్యావర్తమనుపేరు గలదయగును. ఇట్టిగృహంబునందు శాశ్వతంబుగ ధనము గలిగియుండును. ఉత్తరంబున ద్వారంబుగల చతుశ్శాల చక్రమని పేరుగలదియగును. ఇట్టి చక్రాఖ్యగృహంబునందు శాశ్వతం

బుగ నన్నపానాదిభోగభాగ్యంబులు గలిగియుండును. ఈచతుశ్శాలకు నాలుగుదిక్కులయందును ద్వారములు గలుగుటమంచిది.

సీ॥ తడరిచతుశ్శాల నడుమజతుర్ద్వార సదనంబుపుష్కర సంజ్ఞదనరు।
ప్రాఙ్ముఖంబున గృహరాడభిజ్ఞవహంచు బాటించుసకల సంపత్ప్ర
దంబు। దక్షిణముఖమైన ధనపదకాఖ్యచే బరగునుసర్వసౌభాగ్య
కరము। పడమటిముఖముగా భాసితంబగునింద్ర పదనామమింద్ర
వైభవమొనర్చు॥ గీ॥సరవినుత్తరముఖమైనవరుణపదము! రత్నముల
గూర్చురత్నాకరంబులెలమి। నీటువలెనిండ్లపైనిండ్లుదనరు। చంద్ర
శాలలు రాజసంస్థానకరము॥

తా. చతుశ్శాలకునడుముగాను నాలుగు దిక్కులను ద్వారంబులుబెట్టిగృహంబునుగట్టినయెడల నది పుష్కరమనుపేరుచే నొప్పియుండును. ఇట్టి పుష్కరాఖ్యగృహంబు సంపదలచే నొప్పియుండును. ఇంతయుగాక చతుశ్శాలకు సమముగా తూర్పుద్వారంబుగల గృహంబును గట్టినయెడల నాగృహంబు గృహరాట్టని యెన్నబడును ఫలము సర్వసంపదలును గలిగియుండుట. ఈచతుశ్శాలయొక్క ప్రదేశంబునందు దక్షిణద్వారంబుగల గృహంబుగట్టినయెడల గృహము ధనప్రదమను పేరు గలదియగును. ఇట్టిగృహంబునందు చంద్రుని సంపదవంటి సంపదగలిగియుండును. మఱియుచతుశ్శాలయొక్క మధ్యప్రదేశంబునందు పడమటిద్వారంబుగల గృహంబును నిర్మించిన యెడల నాగృహ మింద్రపదమని యెన్నబడును. దానికిఫలంబు ఇంద్ర వైభవంబుగలిగియుండుట. ఇంతియగాక చతుశ్శాలయొక్క మధ్య ప్రదేశంబునంబు ఉత్తరద్వారంబుగల గృహంబును గట్టినయెడల నది వరుణపదమను పేరుగదియగును. దీనిఫలము రత్నలాభంబుగలుగుట. ఈప్రకారము గృహంబులమీద గృహంబులను గట్టినయెడల జంద్ర సాలయని చెప్పబడును. ఇట్టి గృహంబులు రాజులకు చిత్తములైనవి.

## అష్టభాగగృహలక్షణము.

మ॥ అరయన్మజ్జనసాలతూర్పు దెసబాకాగారమాగ్నేయమా।
యరుతన్సుప్తిగృహంబుయామ్యమున నస్త్రాగారమానైఋతిన్।
గురియా భోజనశాలపశ్చిమమున న్గోసాలవాయువ్యము।
త్తరమందున్ ధనశాలశంకరుదెస దేవాలయంబున్నగున్॥

తా. స్నానగృహము తూర్పుదిక్కునను, వంటకసాల యాగ్నేయంబునను, ఆయుధసాల నిఋఋతిదిగ్భాగమునందును, శయనగృహము దక్షిణదిగ్భాగంబునందును, భోజనసాల పశ్చిమదిగ్భాగంబునందును, పశుసాలవాయువ్యదిగ్భాగమునందును, ధనాగారముత్తరదిగ్భాగంబునందును, ఈశాన్యంబున దేవమందిరంబును నిర్మించుట యత్యుత్తమము. సనత్కుమార వాస్తుశాస్త్రమందు "శ్లో॥ పూర్వదితిస్నానగృహం ఆగ్నేయేపాకమందిరం। దక్షిణేదైవశయనం నైరుత్యేచాయుధంగృహం। పశ్చిమేభోజనగృహం వాయవ్యే పశుమందిరం। భండారంబోత్తరదిశ ఈశాన్యే దేవమందిరమ్॥" పై పద్యమునకును ఈశ్లోకమునకు అర్థమాసమాన.

మధ్యగృహనిర్ణయము.

ఇంద్రాగ్ని మధ్యంబెనయునుదధిసాల యనలార్కజులమధ్య మాసాల। యమరాక్షసులమధ్యమును విరేచనసాల దనరువిద్యాలయసురవరుణ। మధ్యంబున పశ్చిమానిలాంతరమున నెనరోధనసాలఘనసమీర। ధనదులనడుమను తగుభోగసాల ధనాధిశివుల మధ్యమవైద్యసాల॥ గీ॥ మరియుశివవజిమధ్య దేశముల నుండు। సూతికాసాలలీరీతిపొందిచూచి। చోద్యములరలక్షణాది గృహస్థులింక్లుగట్టి। నను జెందు భోగభాగ్యములుకృష్ణా॥

తా. తూర్పునకును ఆగ్నేయంబునకును మధ్యప్రదేశంబునందు దధిమదనసాలయును, ఆగ్నేయదక్షిణంబుల మధ్య ప్రదేశంబునందు నెయ్యినూనె మొదలగు పదార్థంబులును బెట్టుకొనుటందగినసాల రచించవలయును. దక్షిణంబునకును నిరురుతిమూలకును మధ్యప్రదేశంబునందు మలమూత్రవిసర్జనసాలను గట్టవలయును. నిరురుతిమూలకును పశ్చిమంబునకును మధ్యప్రదేశంబునందు విద్యాభ్యాసశాల నిర్మించవలయును. పశ్చిమంబునకును వాయువ్యంబునకును మధ్యప్రదేశంబునందు రోదనసాలనుంచవలయును. వాయువ్యంబునకును నుత్తరంబునను మధ్యప్రదేశంబునందు భోగశాల నిర్మింపవలయును. ఉత్తరంబునకును ఈసాన్యంబునకును మధ్యప్రదేశంబునందు వైద్యసాలను, యీశాన్యంబునకు తూర్పునకు మధ్యమునందు సూతికాశాల

కట్టవలయును. యీరీతిగా గృహములను నిర్మించినయెడల సకలై
శ్వర్యంబులను గలిగియుండును.

### రంధ్రగృహపల్లిగృహకాచీగృహలక్షణము.

సీ॥ ఇంద్రార్కజులమీదనిండ్లుగట్టిన ధూమరంధ్రంబునంతోష రహి
తమగును। భానుజువరుణులపైనిండ్లుగట్టిన నసురరంధ్రంబిదికార్య
హాని। వరుణాధనేశులకైనిండ్లుగట్టిన వాయురంధ్రంబు సత్యమును
జెరుచు। ధనభామశైవ్యకస్థానంబులందిండ్లు కాకరంధ్రంబిదిపోనగ
దంపు॥ గీ॥ ఇంద్రధనపులపైనెదిరిండ్లుపల్లి। నామసదనంబుద్రవ్య
వినాశనంబు।శమనధనపులతోటిపద్మములుకాచి। పంక్తినదియును
వైరంబు సంఘటించును॥

తా. తూర్పున నొక్కగృహంబున నొక్కగృహము ధూమ
రంధ్రమనుపేరు గలదియగును. ఇట్టిగృహంబునకు యజమానుడగువా
రికిసకలైశ్వర్యంబులు నశించును. దక్షిణదిక్కున నొక్కయిల్లును పశ్చి
మమున నొకగృహమునుగట్టినట్లైన నది యసురరంధ్రమని చెప్పబా
డును. అది గృహస్వామికార్యముల జెరచును. పశ్చిమమున నొక
యిల్లునుగట్టినయెడల నది వాయురంధ్రమనిపించుకొనును, నది యజ
మానుని యసత్యవంతునిగ జేయును. ఉత్తరంబున నొక గృహంబును
తూర్పున నొక్క గృహంబునుగట్టి యీశాన్యంబున విడువుచేసినేని
యది కాకరంధ్రగృహమని యెన్నంబడును. దీనికి ఫలము సకలకార్య
ములను నశించుట. యీశాన్యంబును ఆగ్నేయంబును విడువుచేసి
తూర్పుదిక్కునను పశ్చిమంబునను ఎదురుగృహంబులను గట్టితే యది
పల్లిగృహమని యెన్నబడును దానికి ఫలము సకలద్రవ్యములును నశిం
చుట. ఆగ్నేయనైఋతిభాగంబులయందు విడువును జేసి దక్షిణంబునను
ఉత్తరముననుఎదురుగృహములనుగట్టి వాయువ్యంబున విడువును జేసిన
యెడల నాగృహంబు కాచీగృహమని చెప్పబడును. దీనికి ఫలంబు దా
యాదులతో గలహముగలుగుటయని యెరుంగవలయును.

### నాట్యశాలాలక్షణము.

గీ॥ వెడుపుముప్పదియారంగ్రము లెలమినిడుపు। హస్తషట్త్రింశకముహా
దవైన। రముత్తరమోరాని పడమటనుండు చుట్టు। జాలకములం
దనర్తకశాలకృష్ణా॥

తా. వెడల్పు తొమ్మిదిచేతులు, నిడుపు ముప్పదాఱుచేతులను నుండవలయును. పొడవైనద్వారము త్తరముననైనను పశ్చిమంబుననైన నుండవలయును, చుట్టు గవాక్షలుంచవలయును. ఇదియ నాట్యశాలయని తెలియవలయును.

మల్లశాలలక్షణము.

క॥ వెడలుపు నెనిమిది చేతులు । నిడుపున బదిరెండుహస్త నిర్ణయముల చో । ప్పడుగ రిడియు దక్షిణముఖ గున । వడి చుట్టుం గవాక్షులుంచవలయును కృష్ణా॥

తా. వెడల్పు ౮ చేతులు, నిడుపు ౧౨ చేతులును నుండవలయును. ఉత్తరపుముఖంబుగా ద్వారంబును బెట్టవలయు. చుట్టునుగవాక్షులుండవలయును. ఇట్టిగృహంబునందు సామును జేయవలయును.

అష్టవాటములకు లక్షణము.

గీ॥ ఇంటివెడలుపు నాల్గుపాల్లెనయ జేసి। అందునొకపాలుగూర్చి భవ్యాగ్రములను । హత్తిసూత్రము మధ్యముం బెత్తిసప్పు । డదియు పాంచాల మనువాటము య్యోకృష్ణా ॥

తా. ఇంటియొక్క వెడల్పును సర్వమును సూత్రముచేగొలిచి దానిని నాలుగుపాళ్లు సేసి మఱియొక్కన ఒకపాలంతకూడితే అది ఐదుపాళ్లసూత్రమగును. అట్టిసూత్రముయొక్క రెండుకొనలును నడిగోడలమీద నిలిపి సూత్రముయొక్కనడుమును రాలకోలను ఎత్తగా అది యెంత పొడవు అగుచున్నదో యాపొడవు పాంచాలవాటమని తెలియవలయు.

సీ॥ పాంచాలవాటంబుపైనంగులులు రెండుకరనిల్పవై దేహికాఖ్యమమరు । నిట్టువ లెంగ్రమముతో లెక్కించ గౌరవకౌజన్యయాత్ఛాఖ్యములుసౌర। సేనగాంధారముల్చెలగునదంతికా వాటంబు లెనిమిది తేటపడును । సురలకవంతిభూసురులకు మాగధ రూఢిగానృపులకు సూరసేన॥ గీ॥ పలమధీశులకు రాజన్యమలరుపాద। జులకువైదేహికముప్రాకృతులకు మొదటి । వాటమగు కౌరవమున సర్వవర్ణములకు । సరవిగాంధారమేనుగు శాలలకును ॥

తా. పాంచాల వాటంబుమీద రెండు అంగుళంబులు ఎక్కించితే అది వైదేహివాటము. అందుమీద రెండంగుళములు జేర్చితే

అదికౌరవవాటమని చెప్పబడును. ఇట్టికౌరవవాటంబుమీద రెండంగుళంబుఎక్కించితే కౌజన్యవాటమనబడును. కౌజన్యవాటముమీద రెండంగుళంబులు ఎక్కించితే మాగధవాటమనబడును. మాగధవాటంబుమీద రెండంగుళంబులు ఎక్కించితే శూరసేనవాట మనబడును. శూరసేనవాటంబుమీద రెండంగుళంబులు ఎక్కించితే గాంధారవాటమని చెప్పబడును. గాంధారవాటంబుమీద రెండంగుళంబులు ఎక్కించితే అవంతినాటమని చెప్పబడును. ఈ ౮ విధంబులయిన వాటంబులలో దేవతలకుఅవంతినాటము, బ్రాహ్మణులకు మాగధవాటము, రాజులకు శూరసేనవాటము, వైశ్యులకు కౌజన్యవాటము, శూద్రులకు వైదేహికవాటము. యీవిధంబు నెఱింగి గృహంబులను గట్టుట యుచితము.

గజోష్ట్రాశ్వపశుశాలలకాయనిర్ణయము.

క॥ గజములకుష్ట్రింబులకను।ధ్వజగజములు మఱియునశ్వపశుసంతతికిం।
ధ్వజవృభంబులశాలలు । నిజముగ భువిగట్టిరేని నిల్చుసుఖంబుల్ ॥

తా. ఏనుగులకు, ఒంటెలకును, ధ్వజాయగజాయంబు లుచితంబులు. అశ్వంబులకును, పశువులకును, ధ్వజాయవృషభాయములు శ్రేష్టంబులు.

దేవరఅడుగులకులక్షణము.

గీ॥ దేవరింటను గౌరీశు చెనను తేవ।వేదికధ్వజంబుసింహంబు వృషభములకు । అడుగుపీఁడవంగుళంబులుహ స్తిసంఖ్య । దించి ముస్నించి యాయంబులెంచవలెను ॥

తా. దేవతలను పూజించునట్టి గృహంబునందు యీశాన్యభాగంబున దేవరయొక్క యడుగు ధ్వజసింహవృషభాయములలో నేదైనను గలిగియుండునట్లు సూచివేదికను నిర్మింపవలయును. వేదికయొక్క ప్రమాణంబు ఎన్నియంగుళంబులగునో కొలిచి యాసంఖ్యను ౮ దింటభాగకూరింపగా ౧ మిగిలెనేని ధ్వజాయమనియును, ౩ మిగిలెనేని సింహాయమనియును, ౫ మిగిలెనేని వృషభాయమనియును వ్రాయవలయును. యీ సూచవిధంబు లయిన యాయంబులుతప్ప [illegible]న యాయంబులు గూడవు.

వటువేదికయొక్కలక్షణము.

గీ॥ ఎనిమిదంగులనిడుపుతో నెనయువెలుపు ।
పాదషట్కముతో గూర్చి పరగజాసె ।
యున్నతముపేదిక యొనర్ప జెన్నుమిగిలి ।
వెలయుశాస్త్రంబు ధరవేదికలకుగృష్ణా ॥

తా. వటువేదికయొక్కనిడుపు రెండుహస్తంబులును, వెడల్పు ఒకహస్తంబును గలిగియుండుట యత్యుత్తమము.

వివాహవేదికయొక్కలక్షణము.

గీ॥ వెలుపునిలుపును నాల్గుచేతులును నొకటి ।
పొడవు వేదికియింటికి యెడమగాను ।
చవికె యొనరించి సోపానసరణిగూర్ప ।
విభవములొసంగు వైవాహవేదియందు ॥

తా. వెడల్పు ౪ హస్తంబును, నిడుపు ౪ హస్తంబును, అడుగుయొక్కఎత్తుఒక్కహస్తంబునుంచి యింటికి ఎడమదిక్కునగట్టి సోపానంబులను దీర్చి నాలుగుమూలల స్తంభంబులు నిల్పి చవికవేయవలయును.

కూపఖననస్వరూప లక్షణము.

సీ॥ యీశాన్యమునవృద్ధి యేప్రొద్దు అనురును పోలుపొందు తూర్పున గలిమిజెందు । ఆగ్నేయమున బుత్రహరణంబు గావించి శమగ దిక్కునను సతికిసప్తి । నిరుఋతిదిశయందు నెనయు మృత్యుభయంబు పశ్చిమంబునగల్గుభాగ్యమెప్పుడు । వాయువ్యమునవచ్చు వైరులచేబాధ యుత్తరాద్దిశయందు నల్పసుఖము ॥

గీ॥ మధ్యమంబున ద్రవ్యంబు మడిసిపోవు ।
నవని నీరీతిదిక్కుల సరసిత్రవ్వ ।
వలయుబావుల నిలయందు నెళ్ళప్రదెలిసి ।
సుగుణుడైనట్టి కూపనిపుణుగనుమువేద్యా ॥

తా. ఈశాన్యంబున బావిని త్రవ్వితే మేలుగలుగును, తూర్పున గలిమిగలుగును, ఆగ్నేయంబున బుత్రులు నశించుదురు, ద

ణంబున భార్య నశించును, నిరుతియందు మృత్యుభయంబు గలుగును, పశ్చిమంబున భాగ్యంబు సంభవించును, వాయువ్యమున శత్రుబాధగలుగును, ఉత్తరంబున నల్పసుఖంబు గలుగును, గృహమధ్యంబున ద్రవ్యహానియగును గనుక శాస్త్రంబును దెలిసి యుచితస్థలంబున బావి త్రవ్వవలయును.

## ఉద్యానవన లక్షణము.

సీ॥ ద్రాక్షాపనసనింబ దాడిమాశ్వత్థ చంపంగి పాటలీ బంధుజీవ।
నారికేళాశోకనారదకగవకళ ఖర్జూరపున్నాగజంబీరతిలక।
మల్లికాజాజిసమన్వితలతాంచితంబైన గృహాంగణంబునశుభంబు।
శ్రీపనంబగుబదరిద్వయప్లక్ష ముత్తరంబునశుభంబాదవుమేడి॥

గీ॥ మఱ్ఱిరావులునలుదట్లు మంచిదండ్రు।
అగిశమాదిఫలద్రుమ మరటిజముగా।
పసుపులోగిటిడనుదానె ప్రబలమయిన।
యచగీడగునండ్రు పదాయతాక్ష॥

తా. ద్రాక్ష, పనస, వేము, దాడింబ, యశ్వత్థ, సంపెంగ, పోక, కలిగొట్టు, దానానము, నారికేళము, అశోకము, నారదము, పొగడ, ఖర్జూరము, పొన్న, నిమ్మ, తిలక, మల్లెజాజి యీ వృక్షంబులు ముంగిటియందుండెనేని శుభంబు గలుగును. మఱ్ఱి, రావి యీవృక్షంబులు గృహంబునకు నాలుగు భాగంబులయందును నుండవలయును. అగిశ, మాదిఫలంబు, అరిటి, జెముడు, పసుపు యీ వృక్షంబులు దమంతట దాము మొలిచినయెడల కీడుకలుగును.

## రోలును నిలుపుటకు లక్షణము.

క॥ మంచిదు శాశ్వతలగ్నము।
లంగేనితదంశలందు నలరిగరోలుం।
బొందింప ధాన్యవర్ధన।
మొందించును ప్రతిదినంబు నుత్సవమలరున్॥

తా. శనైశ్చరుడు స్థిరలగ్నంబునం దయినను, స్థిరాంశయం దయిననుండగ రోలును నిలుపవలయును. అట్లు నిలిపితేని ధనధాన్యాభివృద్ధి గలుగును.

కుమళ్ళు అరుగు లక్షణము.

గీ॥ వేదికగజాయమున జేసి విధునిచాయి।
మిధున నక్షత్రమున తులా వృషభలగ్న।
ములను రాసులను కవినిలుచునపుడు।
పూర్ణకుంభములుంచిన బొసగుజయము॥

తా. గజాయమున వేదికనువేసి మృగశీర్షయను నక్షత్రంబుతోగూడిన సౌమవారమునాడు తులావృషభలగ్నంబులలో నెద్దానియందయిన శుక్రుండు సంచరించుచున్న సమయంబునందు లేక జలరాసులయందు శుక్రుడుండగానయినను కుంభంబులు నిలిపెనేని ఐశ్వర్యంబుగలుగును.

పొయ్యినివేయు లక్షణము.

గీ॥ వహ్నినక్షత్రి కుజవాసరమున లగ్న।
మునసయిన సప్తమరాశినయిన।
గుజుడు వసియించుతరి హోమగుండములును।
పొయిలుపొందింప భాగ్యముల్బొదలుకృష్ణా॥

తా. కృత్తికా నక్షత్ర యుక్తాంగారక వారంబునం దంగారకుడు లగ్నంబునందుండగానయినను, లగ్నంబునకు సప్తమరాశియందుండగానయినను హోమగుండంబులు పొయిలుకుమ్మరామంబులు మొదలగు రామంబులు మొదలగువాని నిలుపవలయును. అట్లయిన శుభంబులు సేకూరును.

మంచములకు పీటలకు.

క॥ శయ్యాసన యన్నంబులు।
చయ్యన రచియింప ధ్వజవృషభసింహంములక।
సెయ్యంబగు నితరక్రియ।
లొయ్యన రచియింపధ్వజమె యుత్తమముహరీ॥

తా. మంచంబులకు పీటలకు ధ్వజవృషభ సింహంబు లుచితంబులు. సకలకార్యంబులకును ధ్వజాయంబు శ్రేష్టమయినది. విస్తారమయినపనులకు హస్తప్రమాణంబున గొలువవలయును. కొంచెమగు పనులకన్నిటికిని వితస్తులచే గొలువవలయును. చిరుతపనుల కలగుళంబులను నిర్ణయింపవలయును. మఱియును చిన్నపనులు యవలచే నిర్ణయింపవలయును.

కంచములుతొలిచి నీళ్ళుచల్లుదిశలకు ఫలము.

సీ॥ ఎలమిభుజియించు కంచముల్ తొలిచిచల్లు।
దిశలఫలమెత్త సురపతి దిక్కుమొదలు।
గాగగల్మియు మానభంగమును మృతియు।
తెవులు సిరిపగధనముభూతియును కృష్ణా॥

తా. కంచము కడిగి యానీళ్ళను దూర్పుభాగమున జల్లితే శుభముగలుగును. ఆగ్నేయమున మానభంగము గలుగును. దక్షిణమున మృత్యుభయముగలుగును. నిరుృతి వాంను తేవ్రులుగలుగును. వాయువ్యంబున శతృత్వనుగును. ఉత్తరమున ధనముగలుగును. ఈశాన్యంబున నయిశ్వర్యము గలుగుటయేగాక నానావిధములయిన సుఖములు గలిగియుండును.

శా॥ సేవ్యశ్రీపదపద్మపద్మసదనా శృంగారవాఙ్మాధురీ।
భవ్యస్వాంతవిహారహారశలిత ప్రస్తుత్యదక్షస్థలీ।
భవ్యశ్యామలవర్ణవర్ణితల సద్బాంధవ్యసౌహార్ద్రసా।
దివ్యామోదితధర్మధర్మనిరత క్షేమంకరాప్రాభవా॥

క॥ విధుతరణిస్ఫుటిచోదన।
మధుసూదనదివ్యనామ మంజులకరుణా।
బుధజనమునిపరిపాలన।
కుధరవరోద్ధరణమదన గోపాలహరీ॥

మాలిని॥ విమలచరితహృద్యా వేదవేదాంతవేద్యా ।
సమధికగుణగణాఢ్యా సర్వవేదాగ్రగణ్యా ।
అమరవినుతపాత్రా అంబుదశ్యామగాత్రా ।
ప్రథితసుకృతపాలా రాజగోపాలబాలా ॥

గీ॥ మీచరణార్చితమతిప్ర ।
జ్ఞాచతురిమవాస్తుసార సంగ్రహ మెలమిన్ ।
నేజేసినాడ నిద్ధర ।
నాచంద్రార్కముగ నిల్పుమయ్య ముకుందా ॥

గద్య.

ఇది శ్రీమన్మదనగోపాలస్వామి కృపాకటాక్షవీక్ష ప్రసాదాసాదిత గణి
తాగుణిత ప్రశస్తవాస్తువిస్తారక్షేత్రంబు రాశిప్రమథన మందరాచ
లాయమాన గద్యపద్యహృద్యచరిత్ర మాశ్వలాయన సూత్ర
వసిష్ఠగోత్ర పవిత్ర పేరు సోమలగణపయామాత్య పౌత్ర
వెంగళామాత్యపుత్ర మల్లమాంబికా గర్భశుక్తిముక్తా
ఫలవిరాజమాన సుధీజనవిధేయ గణపనామధేయ
ప్రణీతంబయిన సటీకా వాస్తుసారసంగ్రహ
లక్షణంబు నన్నది సర్వంబును
మేకాశ్వాసము
సమాప్తము.

శ్రీకృష్ణార్పణమస్తు.

## భక్తవత్సల అండు కంపెనీ,

నెం 9. చాకలపేట, సౌకార్ పేటపోస్టు, మదరాస్.

గ్రంథముల ప్రకటన.



ఇందు నీతి, ఆచారము, ధర్మము, వేదాంతము మొదలగు పలువిషయముల గురించి వేమన గారిచే రచియింపఁబడి మేలయిన ఈ గీతములపై సుందరమైన పెద్దక్షరములో 3200-పద్యములను విడివిడి పద్యములుగా ముద్రించియున్నాము. దీని పిన్నలు మొదలు వృద్ధులవరకు చదువుటకు అనుకూలముగానుండును.

ప్రతి 1-కి 2-0-0 డిం గ్లేసు 2-8-0

# సత్యహరిశ్చంద్ర

వచనకావ్యము.

వసిష్ఠ విశ్వామిత్ర నారదాదిప్రముఖులు సభనున్న యింద్రసభయందు సత్యధర్మపరాయణశీలుఁడగు హరిశ్చంద్రుని వసిష్ఠుండు పొగడుటను విని విశ్వామిత్రుఁడు నారదప్రేరేపణచే కోపముగలవాఁడై హరిశ్చంద్రుఁ డసత్యుఁడనుపించ పంతంబుగొని భూలోకమువచ్చి యయ్యనేపమున బంగారు దానంబుగోరి వానిరాజ్యంబెల్ల పరిగ్రహించి అడవిపాలుచేసి వానిని పడరానిపాట్ల నాడించ కాశీక్షేత్రముచేరిన హరిశ్చంద్రుఁడు తనభార్యను విక్రయించి తానును విక్రయించుకొని కాటికి కావలివాఁడైయుండుతరి పాముచే గఱవబడిన లోహిదాస్యుని కాటికితెచ్చిన చంద్రమతినిగాంచి చింతించి వాని కాసుదెమ్మని పంపించిన విశ్వామిత్ర మాయాకల్పితమునల్ల కాశీరాజకుమారుని చంపినది చంద్రమతియని నెపమిడి హరిశ్చంద్రునిచే చం

ప్రమతిని శిరచ్ఛేదము చేయుమని శెలవిడిన రాజాజ్ఞను శిరసావహించిన హరిశ్చంద్రునకు చంద్రమతి శిరసు తునకలుసేయుచుండగ శ్రీహరి గరుడారూఢుడై ప్రత్యక్షంబుగనిలిచి వారలనూరార్చి వశిష్టవిశ్వామిత్రుల పంతంబులపోనిచ్చి యెప్పటియట్ల శిశువునకు ప్రాణంబులిచ్చి రాజ్యభారంబునలుపుమని అయోధ్యకుపంపి వశిష్ట విశ్వామిత్రాదులతో పట్టాభిషేకంబొనర్చి ఆనందింపఁ గోరెను. ప్రతి 1-కి 0-10-0

దేవతాసిద్ధికరము

# మలయాళ మంత్రరాజీయము

ఇది రెండు భాగంబులలో ముద్రింపబడిన మంత్రగ్రంథము మొట్టమొదట నిది కేరళభాషయగు మలయాళభాషలో నుండినది. మేము ధనవ్యయ శరీరప్రయాసలకు వెనుదీయక మంత్రజ్ఞులైన పండితుల సహాయంబున నాంధ్రంబున ముద్రించితిమి. ఇందు ప్రతిమంత్రమునకు నష్టకర్మవిధాయకంబు లేర్పాటుచేసి యంత్రసహితంబుగ నుంచుటంజేసి ఇదిచదివి యాప్రకారం ఉపయోగించువారలకు విశేషఫలములనొసంగు కామధేనువువలెనుండును. ఇందు చెప్పబడియుండు నష్టస్థానదేవతలు విఘ్నేశ్వరుడు, సుబ్రహ్మణ్యుడు, ఆంజనేయుడు, బాలా, గరుడుడు, సూర్యుడు, మలయాళస్త్రీగదేవత, పంచభూతములు, సరస్వతి, మహాలక్ష్మి, భద్రకాళి మొదలగునవి, ఇవిగాక బిడ్డలకు, పిన్నలకు, పెద్దలకు, కర్మవశంబునవచ్చు రోగములను, దయ్యములను, శోధబోతులను నివారణచేయు మంత్రంబులను యంత్రసహితముగ నుంచుటజేసి ఇది ప్రతియింట నుండదగిన గ్రంథమగును. ఈ గ్రంథమును జదివినవెనుక వేరుగ్రంథములను జూడవలయునను నిచ్ఛజనింపదు ఒకప్రతినైనగొని చదివిచూచినయెడల మామాటలందలి సత్యాసత్యములు బోధపడును. ఇవి యితరమంత్రగ్రంథములవలెగాక మంత్రశాస్త్రోక్తప్రకారంబున ఋషి, బీజము, శక్తి, కీలకము, వినియోగములు దెలుపంబడి యంగన్యాస కరన్యాసములతో ధ్యానమంత్రి

ములతో విలసిల్లుచున్నయని అష్టకర్మములు వివరించునపుడు హోమము, తర్పణము, ఫలము సాంగముగ శాంతముగ విశదీకరింపబడియున్నది. మే మాగ్రంథమును గురించి శ్లాఘించుటకన్న మీరలే యొక ప్రతినిగొని యందలి గుణావగుణంబులఁ గనుటమేలని యింతటితో నిలిపెదము.

రెండుభాగములు ఒకటైబైండు ప్రతి 1-కి 1-12-0

## పులిప్పాణివైద్యరహస్యము

ఈ గ్రంథము మహాసిద్ధులకు పులిప్పాణిస్వాములవారు ప్రబోధించిన పులిప్పాణి బ్రహ్మవిద్యారహస్యమును పతిష్టపత్రిక వైద్యశాస్త్రము. యీ గ్రంథము యిటీవల జగన్నాథపురమందు నివసించుచుండు మహాందాతయగు గోపాయిస్వాములవారు చాలాకాలము నుండి అనుభవించుచుండిరి. ప్రకృత మీగ్రంథము డాక్టర్ యస్. టి. యస్. గోపాలయ్య అనువారివలన దేవభాషయగు నాగరభాషయందుండినదానిని తెనుగున తర్జుమాచేసి యేయొక్క తప్పులులేకను యింకా అనేకపండితులచే సరిచూడబడి మాకంపెనీలో అచ్చువేయబడియున్నది. ఇటువంటిశాస్త్రమిదివరకు మనకండ్లారచూచినది లేదు. దీనిలో నుదహరించియుండు ఔషధములు ఒక్కొక్కటిన్ని అమూనియులవల్ల అనుభవించి తమయొక్క స్వానుభవమునకు తేబడినది దీనిలోయుండు భాగముల నిర్ణుల శ్రద్ధగా చేసి పరీక్షించినయెడల వాటియొక్క గుణముల గాంచి తెలుసుకొనవచ్చునుగాని దీనిని శ్లాఘించి వ్రాయవలసిన నిష్ప్రయోజనము.

దీనివెల ప్రతి 1-కి 1-8-0

## భట్టివిక్రమాదిత్యునికథ.

దీనిలో భోజరాజు జననము మొదలుకొని విక్రమాదిత్యునుప్పదిరెండు సింహాసనమెక్కినది, అడవియందారు నెలలు, యింటియందారు నెలలు గడపినదియు, భేతాళుడు చెప్పిన యిరువదినాలుగు కథలును, ప్ర

తిమలు చెప్పిన ముప్పదినాలుగు కథలున్ను చాలాకాలము రాజ్యము జేసిన విధమును గలవు. ప్రతికథయు బహువిచిత్రముగా జెప్పబడియున్నది. ఒక్కొక్క కథకు తగినట్టు చిత్రమైనపటములతో అచ్చొత్తింపబడియున్నది. ముఖ్యముగా ప్రతియింటియందు నుంచుటకు తగిన గొప్పకథ పుస్తకము.

ప్రతి 1-కి 2-0-0　　పోస్టేజు 2-8-0

# అల్లి అర్జున యమున పద్మావతి చరిత్రము.

వచనకావ్యము.

భారతీనయుడు అర్జునుడు తీర్థయాత్ర వెడలి దక్షిణమధురకువచ్చునపుడు పాండ్యరాజు మధురాపురమేలుచుండ వానలులేక తపించి హటాత్తుగాగలిగిన వెల్లువకు అడ్డపరచుటకై యింటింట వచ్చినవారిచే గట్టువేయుచుండగా వృద్ధురాలివ్వ వంతుకైవచ్చిన శ్రీచొక్కనాధస్వామి ప్రప్పరివాని చందము వచ్చి గంగవ్వయిచ్చు అట్టుకై ఆశించి గట్టువేయక నిలుచున్నవాని రాజుగాంచి తనచేతిబెత్తముతో వొక్కవేటువేసిన కోపమున సంతానములేక పోవునట్లు యుపిశపించిన విజయరాజు అరణ్యముచేరి తపమాచరించ మీనాక్షికృపచే అల్లితామరయందు నొక పుత్రికను గలిగించియిచ్చెను. ఆబిడ్డకు అల్లియనుపేరిడి మధురాపురి పట్టముగట్టిన తరువాత నీలుడనుకొరకని జంపుటయు, శ్రీకృష్ణ సహాయుండగు అర్జునుడు అల్లిరాణివిఱుచున్నట్టి దండనలకు తప్పించుకొనుటయు, మదవతియగు అల్లిరాణిపై మోహంవేయుండగు అర్జునుడు పాము తనవ్యామోహముదీర్చుకొనుటయు, అల్లిరాణి తెలియక కంఠమున మాంగల్యముకట్టుటయు, కోపావేశమున అల్లిరాణియుద్ధముసేయుటయు, కడకుఅల్లిరాణిని అర్జునుకు వివాహమాడుటయు లోకవిచిత్రముగాను వినుటకు ప్రియముగాను పూర్వకవియగుపుగళేందియును ప్రసిద్ధికవిత ద్రావిడభాషయందు వ్రాసినకథను తెలుగుభాషయందు తర్జుమాచేయించి మాచే ముద్రింపబడినవి.

దీనివెల ప్రతి 1-కి 0-10-0

పంచపాండవుల వనవాసము, వచనకావ్యము　　0-10-0

నలమహారాజు నాటకము.　　ప్రతి 1-కి 0-6-0

# యూనానివైద్యామృతము

ఇప్పటివరకు మనవైద్యులును, ప్రజలును యూనానిభాగంబు
చ్చగొనియుండుటచే ధన్వంతరివైద్యమున గొంతవఱకు సంగ్ర
జేర్చితిమి. ఆదిగన్నవారు కొందరు ప్రత్యేకముగ ననుభవరూప
యూనానీవైద్యశాస్త్రమును ముద్రించిన మేలయియుండునని
యందున నీగ్రంథము ప్రచురించితిమి. ఇందలిభాగములన్నియు నను
యినవి. గనుక నెల్లరును జేసికొని సేవించి సుఖ మొందగలరు.
సర్వవృత్తులు నలువదియైదువిధములు, మాజునములు షర్బతులు
ములు, ముఱబ్బాలు లేహ్యములు వీనిపాకములు గలవు. ఇతరరోగ
లకు యూనానిశాస్త్రప్రకారము వివిధములయిన మందులిందున్నవి.
ప్రజలప్రాణాధారములగు శుక్లశోణితముల కాపాడుకొను మార్గములు వీని
లగు సుఖారోగములు, అకాలక్రియలచే గలిగెడుబాధల నివర్తిచేసి
ను నుపాయములు లిందుగలవు. యూనాని పద్ధతులేగాక యిందు
దూ యింగ్లీషులయనుభవపద్ధతులుగలవు. ప్రతి 1.కి 0-12-0

# సిద్ధమూలికారహస్యము

ఈలోకోపకారమైన వైద్యగ్రంథము వైద్యానుభవముగల వారల
క యితరులకు నుపయోగించునట్టుల తేటతెనుగున పద్యగద్యముల
వ్రాయబడియుండుటచేత నిదిప్రతియింట నుండదగినది. ఇపుడు వెలి
నది మొదటిభాగము ఇందు పదునెనుసిద్ధులు చెప్పిన యెనుబదిమూ
నెత్తువిధము, మూలికల సంగ్రహించునపుడు పఠింపవలసిన మం
ులు, లిఖింపవలసినయంత్రములు చిత్రసహితము జేర్చబడియున్నది.
సమూలికలకుగల పర్యాయపదంబుల నిఘంటువు పూర్తిగా నిం
దు. ఆయామూలికలచే కుదురునట్టిరోగములు, ఆరోగ్యలక్షణము

లు వివరముగా జెప్పబడియున్నది. అట్లుండుటచేత నీపుస్తక
పువారికి సర్వవైద్యగ్రంథములందుండెడు విషయములన్ని
ముగా బోధపడునటులకు ఇట్టి యభ్యంతరమును లేదు. బో
పోస వైద్యగ్రంథములను దీసి చదువుటకన్న నీగ్రంథము నో
కొనుట లాభకరము ఇందు జెప్పబడియుండు విషయములన్ని
భవసిద్ధములయినవి. తీసియనుభవించిన వారికి దీనిలాభములు
ను. ఇట్టి వైద్యగ్రంథము నిదివరకు నెవరును ముద్రించియుండలేదు
ప్రతులే ముద్రించియున్నాము. కావలసినవారు ముందు మంచికొ
వెనుకజింతించిన లాభములేదు. ప్రతి 1-కి 1-0-0

# సకలసర్వగుణాద్భుతదీపిక

ఈజ్యోతిషశాస్త్రము ప్రతివారికి ముఖ్యముగా కావలసినది. ముహూర్త
భాగము, లగ్నభాగము, దశాభుక్తిభాగము, గ్రహభాగము, స్వప్నభాగ
ము, స్త్రీభాగము, ఋతుభాగము, పురుషభాగము, హస్తభాగము, సాము
ద్రికభాగము, ఉత్తమమధ్యమభాగములు, ఆంజనేయప్రశ్న, రామప్రశ్న
మొదలగు ముఖ్యవిషయములు గలవు. ఇదిగాక శ్రీరామసీతా ప్రశ్నము
మొదలగు ఆరూఢచక్రము నూతనముగా చేర్చబడినది. 0-10-0

# సరస్వతీకల్యాణపాటలు

ఇందులో మేలుకొలుపులు, నలుగుపాటలు, దయ్యాంపాటలు,
కోడిపాటలు, బంతిపాటలు, పెండ్లిపాటలు, శృంగారకీర్తనలు, మంగళ
హారతులు, భక్తిరసకీర్తనలు. రగడలు, కందార్థములు మొదలగునవి
అణగియున్నది. దీనిని బాలురు, బాలికలు, స్త్రీలు మొదలగువారు
పాడుకొనుటకు యింపుగను, వినుటకు సంతోషముగాను యుండును

స్త్రీలకు యిది భూషణమువంటిగ్రంథము. ఈ చిన్నపుస్తకమును కొన్ని ప్రతులే ముద్రించియున్నారము గాన శీఘ్రముగా తెప్పించి చదివి ఆనందించవలసి ప్రార్థన. దీనివెల ప్రతి 1-కి 0-8-0

## శ్రీధన్వంతరి

# వైద్యచికిత్సాసారము

“శరీరమాద్యం ఖలుధర్మసాధనం” అనెడు ప్రమాణము ననుసరించి సకల ధర్మములకు సాధనంబగు శరీరంబును మిక్కిలి ఆరోగ్యముగ నుంచుకొనుట ముఖ్యము. అట్టి ఆరోగ్యదాయకములగు ప్రయోగములను వైద్యాంశంబులే సాధనంబులని వేఱుగ చెప్పవలయునా? అట్టి వైద్యామృత భూయిష్టంబగు నాయుర్వేదంబును జగదీశ్వరునివలన క్రమముగా నొకరొకరెరింగి ప్రచురపఱచుట మనము చూచుచున్నారము. అట్టిగ్రంథము లనేకములుండియు నెల్లరకు తెలియునటుల స్వల్ప క్రయమునకు వ్రాసియున్నారము. సర్వసాధారణంబుగ ననుభవంబునకు నన్నివిధముల ననుకూలంబుగ ప్రతి యింటియందును తప్పకనుండదగిన యీగ్రంథరత్నమును గోసాయిస్వాముల వారివలన అనేక రస, యోగ, కషాయ, తైల, లేహ్యామృత, చూర్ణ, సింధూర, మాజన, మురబ్బా మొదలగు అనేకాంశంబులు తేటతెనుగున విశదముగనున్నవి ఇందు చెప్పిన మూలికాదిద్రవ్యములన్నియు సామాన్యంబుగ సందేహము లేక ప్రతిచోటను చిక్కునవి. ప్రతి 1-కి 0-12-0

## స్త్రీ భ క్త వి జ య ము.

పురుషులగువారిలో భక్తులగువారిచరిత్రము లున్నవికాని, భక్తశిరోమణులగు స్త్రీలచరిత్రములు లేవు. ఆకొదవ నివారించుటకియు పతివ్రతలలో యిరువదుగ్గుర చరిత్రమును వచనరూపముగా సులభశైలిని

ముద్రించియున్నారము. ఇంకే పనులయినదే పులిజూదము, సోగటాలుఆడి కాలము వ్యర్థపుచ్చకొను స్త్రీలకునిది మిగుల కారియని చెప్పవచ్చును. దీనిచే స్త్రీలు గుణవతులగుటకు సంశయములేదు. స్త్రీలుండు ప్రతియింట యుండదగినది. వెలస్వల్ప మధికము అశ్లీలములగు నీచపుస్తకముల నాడువారి చేతికిచ్చి నేల దెప్పియుంచెదరు. ప్రతి 1 కి 0-

## కాశీరామేశ్వర యాత్రాదర్పణము.

అకార్యకరణంబులచే పాపభూయిష్ఠులైన ప్రజలు జీవించుట దగినమార్గము, తీర్థయాత్రాదులు, ఈతీర్థయాత్రలలో మిగుల నుత్తమైనది కాశీరామేశ్వరయాత్ర. ద్రవ్యముండిన నటపోయియేమిచేసిన నే లాభమో తెలియజాలక ధనాశాగ్రస్థులగు వారలచే వ్యర్థముగ గోలుపోయెదరు. ఈపుస్తకము చేతనుండినయెడల నట్టివి జరుగనేరవు. అదిగాక, ధనములేనివారు యాత్రచేయజాలరు. వారలు తీర్థయాత్రాఫలంబు నొందుటకై యీగ్రంథము వెలియిడబడెను.

దీనివెల ప్రతి 1-కి 0-12-0

## నలభీమపాకశాస్త్రము.

ఇది మూడుభాగంబులుగలిగి కలికోబైండు చేయబడియున్నది. ఇందు తినదగినపదార్థములను, వానిచేయువిధమును, ఆపదార్థములను దినుటచే దీనికట్టివ్యాధులును, చట్నీలు, బజ్జీలు, కజ్జాయములు మొదలగునవి చేసికొనువిధానంబును, పాత్రాపాత్రశుద్ధు లిందుగలవు. యీశాస్త్ర మొక్కొక్కయింటిలో నుండినయెడల నాయింటికి పదార్థములకు దస్కు వేయుండదు. ప్రతి 1-కి 1-8-0

నలమహారాజుచరిత్ర వచనకావ్యము. ప్రతి 1-కి 0-8-0

సమ్మోహనశాస్త్రము అండ్ అదృష్టకాండము. ప్రతి 1-కి 1-8-0

ఇందుకు అభ్యాసనాచక్రము ప్రతి 1-కి 0-5-0

హిప్నాటిసం అను మనోవశ్య తత్వశాస్త్రము. ప్రతి 1-కి 2-8-0

ఇందుకు అభ్యాసనాచక్రము ప్రతి 1-కి 0-4-0

## యూనానివైద్యామృతము.

ఇపుడిప్పుడు మనవైద్యులును, ప్రజలును యూనానిభాగంబులపై నిచ్చగొనియుండుటచే ధన్వంతరివయిద్యమున గొంతవఱకు సంగ్రహముగ జేర్చితిమి. అదిగన్న వారు కొందరు ప్రత్యేకముగ ననుభవరూపమయిన యూనానివయిద్యశాస్త్రమును ముద్రించిన మేలైయుండునని చెప్పినందున నీగ్రంథమును ప్రచురించితిమి. ఇందలి భాగములన్నియు ననుభవమయినవి గనుక నెల్లరును జేసికొని సేవించి సుఖ మందనగును. ఇందుపర్భత్తులు నలువదియైదువిధములు, మాజునములు పండ్రెండువిధములు, మురబ్బాలు, లేహ్యములు వీనిపాకములు గలవు. ఇతరరోగములకు యూనానిశాస్త్రప్రకారము వివిధములయిన మందు లిందున్నవి. మనుజుల ప్రాణాధారమగు శుక్లశోణితముల కాచికొనుమార్గములు వీని చేగలుగు సుఖారోగ్యములు, అకాలక్రియలచే గలిగెడుబాధల నివర్తించుకొను నుపాయము లిందుగలవు. యూనానిపద్ధతులేగాక యిందు హిందూ యింగ్లీషు అనుభవపద్ధతులుగలవు. ప్రతి 1-కి 0-12-0

## ధన్వంతరివైద్య చికిత్సాసారము.

"శరీరమాద్యం ఖలుధర్మసాదనమ్" అనెడు ప్రమాణము ననుసరించి సకలధర్మములకు సాధనంబగు శరీరంబును మిక్కిలి ఆరోగ్యముగ నుంచుకొనుట ముఖ్యము. అట్టి ఆరోగ్యదాయకములగు ప్రయోగాదులను వైద్యాంశంబులేసాధనంబులని వేఱుగ మేముచెప్పవలయునా? అట్టి వైద్యామృతభూయిష్టంబగు నాయుర్వేదంబును జగదీశ్వరునివలన క్రమముగానొకరొక రెఱింగి ప్రచుఱపఱచుట మనముచూచుచున్నారము. అట్టిగ్రంథములనేకములుండియు యెల్లరులకు తెలియునటుగాక దుస్తర ప్రయోగములతోను అట్లుగాకున్నచో అధికక్రయము వుంచియున్నారట్లుగాక సర్వసాధారణంబుగ ననుభవంబునకునన్నివిధముల ననుకూలంబుగ ప్రతియింటియందును తప్పకనుండతగిన ఈగ్రంథరత్నమును గోపాయిస్వాములవారివలన అనేక రస, యోగ, కషాయ, తైల, లేహ్యాన్వృత, చూర్ణ, సింధూర, మాజన, మురబ్బా మొదలగు అనేకాంశంబులు తేటతెనుగున విశదముగనున్నవి. ఇందుచెప్పిన మూలికాదిద్రవ్యములన్నియు సామాన్యంబుగ సందేహములేక ప్రతిచోటను చిక్కునవి. దీనిని దళముయిసకాగితములందు ముద్రించియున్నది. ప్రతి 1-కి 0-12-0

సత్యహరిశ్చంద్ర. (వచనకావ్యము.)

వశిష్ఠ విశ్వామిత్ర నారదాది ప్రముఖులునిండిన యింద్రసభ యందు సత్యధర్మ దయాశీలుఁడగు హరిశ్చంద్రుని వశిష్ఠులు పొగడుట లనువినిన విశ్వామిత్రుడు నారదప్రేరేపణచే కోపముగలవాడై హరిశ్చంద్రు డసత్యుఁడనుపించ పంతంబుగొని భూలోకమువచ్చి యగునెప మున బంగారుదానంబుగోరి హానిరాజ్యంబెల్ల పరిగ్రహించి అడవిపాలు చేసి వానిని పదరానిపాట్ల నాడించ కాశీక్షేత్రముచేరిన హరిశ్చంద్రుఁడు తనభార్యనువిక్రయించి తానును విక్రయించుకొని కాటికి కావలివాడైయుండుతరి పాముచే గరవబడిన లోహితాస్యుని కాటికిదెచ్చిన చంద్రమతినిగాంచి చింతించి వానికాసుదెమ్మని పంపించిన విశ్వామిత్రమాయాకల్పితమువల్ల కాశీరాజకొమారునిచంపినది చంద్రమతియని నెపమిడిహరిశ్చంద్రునిచే చంద్రమతిని శిరచ్ఛేదముచేయుమని సెలవిడిన రాజాజ్ఞనుశిరసావహించిన హరిశ్చంద్రుండు చంద్రమతిశిరము తునిబడసేయు నపుడు శ్రీహరి గరుడారూఢుడై ప్రత్యక్షంబుగనిలిచి వారల నూరార్చి వశిష్ఠవిశ్వామిత్రుల పంతంబులపోనిచ్చి యెప్పటియట్ల శిశువులకు ప్రాణంబులిచ్చి రాజ్యభారంబునలుపుమని అయోధ్యకుపంపి వశిష్ఠవిశ్వామిత్రాదులతో పట్టాభిషేకంబొనర్చి ఆనందింపగోరెదను. వెల 0-10-0

నలభీమపాకశాస్త్రము.

ఇది మూడుభాగంబులుగలిగి కలికోబైండు చేయబడియున్నది. ఇందు తినదగినపదార్థములను వంటచేయువిధమును, ఆపదార్థములను దినుటచే దీరునట్టివ్యాధులును, చట్నీలు. బజ్జీలు, కజ్జాయములు మొదలగునవి చేసికొనువిధానంబును, పాత్రగృహశుద్ధులిందుగలవు. ఈశాస్త్ర మొక్కొకయింటిలో నుండినయెడల నాయింటికి పదార్థములకు దక్కువేయుండదు. సకలకార్యములకు శుభకరంబైయుండును. వెల 1-8-0

పెద్దచ్చు వేమనపద్యము:—ఇందులో 3200 పద్యములును అణగి యున్నది. చదువుటకు మిక్కిలి సులభముగాయుండును. వెల 2-0-0

డిటో గ్లేసుకాగితములు వెల 2-8-0

భట్టివిక్రమాదిత్యునికథ:—ఇందులో ప్రతికథలకును చిత్రమైన పటములనుచేర్చి బహువిచిత్రముగా నచ్చొత్తించబడియున్నది.

వెల 2-0-0 డిటో గ్లేసుకాగితములు ప్రతి 1-కి వెల 2-8-0

